THE LORD IS CALLING
(TELUGU)

# ప్రభువు పిలుస్తున్నాడు

ఎస్.ఎమ్.మలిక్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, ఛత్తాబజార్
హైదరాబాద్ - 500 002.

**PRABHUVU PILUSTUNNAADU**

THE LORD IS CALLING (Telugu)



**Telugu Islamic Publications**

**Series No. 71**

Written by : S.M. MALLICK



First Edition : December, 1993

Price : Rs.15=00

Copies : 2000

Cover Page by : S.M. MALLICK

Illustrations by : MOHAN

Published by : Telugu Islamic Publications
'Sandesha Bhavanam'
Lakkadkot, Chatta Bazar,
Hyderabad - 500 002. India.
Phone: 521237,
Grams : 'Geeturai-500 002'

Typeset by : Geeturai Graphics
Lakkadkot, Hyderabad - 2

Printed by : Kala Jyothi Process (P) Ltd.
R.T.C. X Roads, Hyderabad.




అల్లాహ్

మిమ్మల్ని 'నెమ్మదినెలవు' వైపునకు

పిలుస్తున్నాడు

(దివ్య ఖుర్ఆన్–10 : 25)

ప్రభువు పిలుపునే
కడవరకూ అందజేస్తూ
అందులోనే లీనమైపోయిన
మా మేనమామ
సయ్యద్ షా మఖ్దూమ్ మొహియుద్దీన్ కాదిరి గారి
ఆత్మపై శాంతిని, కరుణను
కురిపించమని
ప్రార్థిస్తూ ....

మలిక్

# ధన్యవాదాలు!

మానవాళి మార్గదర్శకత్వానికి విశ్వకర్త పంపిన దివ్యగ్రంథం ఖుర్‌ఆన్. దాని కేంద్ర బిందువు మానవుడు; చర్చనీయాంశం మానవుని సఫలతా విఫలతల ప్రమాణాలు, వస్తువు మానవుని వ్యక్తిగత, సామూహిక జీవితానికి మార్గచిహ్నాల నిర్దేశన. మానవుని ఆధ్యాత్మిక, నైతిక ఉన్నతీ వికాసాలే దాని ఆశయం. మానవుని కుటుంబ జీవితం మొదలుకుని సామాజిక, ఆర్థిక, రాజకీయరంగాల సుఖమయ, సమరసపూరిత, సమగ్ర రూపకల్పనే దాని లక్ష్యం.

ఖుర్‌ఆన్ మానవుని మనసును నేరుగా తాకే అనేక సన్నివేశాలను సృజిస్తుంది. మానవుని అంతర్యాన్ని కదలించివేసే ఉదంతాలను అనేకం ఉల్లేఖిస్తుంది. మనిషి గుండెల్ని కరిగించివేసే మాటల్ని ఎన్నింటినో సూటిగా పలుకుతుంది. ఇలాంటి వాటిలో అన్నింటిలోకి కాకపోయినా కొన్నింటిలోకయినా తొంగిచూద్దామని, ఆ వెలుగు కెరటాలలో కాస్సేపయినా తేలియాడే యత్నం చేద్దామని ఉవ్విళ్ళూరడం ఖుర్‌ఆన్ చదువరలకు సహజం.

అలాంటి ప్రయత్నంలో భాగమే ఈ చిరు పుస్తకం.

లోగడ 'గీటురాయి' వార పత్రికలో (1-4-1988 నుంచి 14-7-89 సంచిక వరకు) ఈ లేఖనలు ప్రచురించినప్పుడు పాఠకులనేకమంది వాటిని పుస్తక రూపంలో తేవాలని బలంగా కోరారు. వాటిని కనీసం పునస్సమీక్షించే తీరికయినా లేకపోవడం చేత ఇన్ని రోజులు ఆలస్యమయింది. సోదరులు దేవిప్రియ చొరవ, పట్టుదలవల్ల ఈ పుస్తకం ఇంతకాలానికయినా వెలుగును చూడగలిగింది.

ఇది ఖుర్‌ఆన్ వచనాలకు వ్యాఖ్యానం ఎంత మాత్రం కాదు. అంతటి జ్ఞానం, విద్య, సాహసం నాకు లేవు. ఆయా ఆయత్‌లు (వచనాలు) చదివి వాటిని అర్థం చేసుకునే ప్రయత్నంలో నా అంతర్యాన వెలిసిన ఆలోచనా తరంగాల భాష్యమే ఈ సమర్పణ.

ధార్మిక గ్రంథాలనగానే ఏ మాత్రం అందంగా ఉండనక్కరలేదని, మేథకే తప్ప మనస్సుకు వాటిలో మేత అసలే అవసరం లేదని, బాహ్యపరమయిన మెరుగులకన్నా అంతర్గత సౌందర్యమే వాటికి ముఖ్యమని ఓ అపోహ మన ప్రజల్లో ఉంది. దాన్ని పటాపంచలు చేసి ఆలోచింపజేసే సౌందర్యమూ ఉంటుందని, ఆహ్లాదాన్నిచ్చె ఆలోచనలూ ఉంటాయని నిరూపించాలన్న దీక్షతో ప్రముఖ కళాకారులు 'మోహన్' చేత ఈ 'ప్రభువు పిలుపు' కు బొమ్మలు వేయించారు– ఇదీ దేవిప్రియ సంకల్పం వల్లనే సంభవమయింది.

ఇందులో ప్రస్తావనకు వచ్చినవన్నీ దివ్యఖుర్‌ఆన్ వచనాలే గనకను ఖుర్‌ఆన్ బోధనలకు కేంద్రం మానవుడే గనకను బొమ్మల్లోనూ మానవ ఛాయలు తప్ప లేదు అని కళాకారులు మోహన్ అభిప్రాయపడ్డారు. మరో విషయం, రిఫరెన్సులో ప్రతిచోటా ఖుర్‌ఆన్ అని వ్రాయలేదు. రిఫరెన్సులో మొదటి అంకె సూరాకు సంబంధించింది. రెండవ మూడవ అంకెలు ఆయత్ (వచనాం)ను సూచించేవి అని పాఠకులు గమనించగలరు.

ఈ మహత్కార్యంలో తోడ్పడిన సోదరులందరికీ ధన్యవాదాలు.

హైదరాబాద్

*5.12.1993* మలిక్



# నిరాశ నిషిద్ధం !

అజాగ్రత్త కారణంగా దాసుడు స్వామిని విస్మరించాడు; ఆయన చిహ్నాలు గోచరించినా ఉపేక్షించాడు; ఆయన హెచ్చరికలు ఎదురయినా అలక్ష్యం చేశాడు.

అయితే స్వామికి జరిగిన నష్టమేమిటి? ఒక్కటీ లేదు. దాసుడు తానే మోసపొయ్యాడు. ఆ ఒక స్వామిని కాదని అసంఖ్యాక స్వాములకు మోకరిల్లాడు. ఆ ఒక్క దాస్యం వద్దని సృష్టిలోని అత్యల్ప జీవి మొదలుకుని మహాజడపదార్థాల వరకు అన్నింటికీ తలవంచాడు. ఇది మనిషి స్వయంగా తనపైన తాను చేసుకున్న జులుం.

జులుం చేసుకున్న మనిషి క్రుంగిపోతున్నాడు. చేసిన పొరపాటు గ్రహించి పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాడు. నిరాశా నిస్పృహలు నలువైపుల నుంచి ఆవరిస్తున్నాయి. క్రియాశూన్యమయిన ఆలోచనలతో దారి కానరాక, గమ్యం తెలియక, పరిస్థితులతో రాజీ పడటానికి సిద్ధమవుతున్నాడు, తిరిగి జులుంలో కూరుకుపోతున్నాడు.

మనిషిని, తానే సృష్టించుకున్న ఈ విషవలయం నుండి కాపాడేదెవరు? ఈ నా ఆత్మవంచనా కూపం నుండి మనిషిని వెలికి తీసే వారెవరు? తనకు తానే చేసుకున్న అన్యాయం నుండి మనిషిని రక్షించే నాధుడెవరు? ఇంకా ఎవరు? ఆ నిజ స్వామియే! ఆయన పిలుస్తున్నాడు :

*"మీ ఆత్మలకు అన్యాయం చేసుకున్న ఓ నా దాసులారా! దైవ కారుణ్యంపట్ల నిరాశ చెందకండి, దేవుడు తన దాసులు చేసిన సకల అపరాధాలను నిస్సందేహంగా మన్నిస్తాడు. ఆయన క్షమాశీలుడు, కరుణామయుడు."*

*(39: 53)*

# ప్రతిఫలదినం తథ్యం !

మనిషి తన దైవం పట్ల అలక్ష్యభావానికి గురయ్యాడు. కారణం ? తన జీవితమే అతన్ని మోసంలో ముంచివేసింది.

జీవితమంటే అంతా ఈ ప్రపంచంలోనే ఉంది అన్న భావం అతన్ని చుట్టుముట్టింది.

అందువల్ల సాధ్యమయినంత మేరకు సుఖాస్వాదన చేసుకోవాలి. బతుకులోని మజాలన్నీ జుర్రుకోవాలి. తన సుఖంకోసం తన ఆనందంకోసం ఏమయినా చెయ్యాలి. ఇవే అతని ఊహలూ పథకాలు.

మనిషి మనసు బోధిస్తుంది :

ఏది తిన్నా తాగినా, ఎవరిని వంచించినా, ఎవరి ధనమాన ప్రాణాలకు ఎసరు పెట్టినా అడిగేవారెవరు? అడ్డుకునే వారెవరు?

ఏ చర్యకు ప్రతిఫలమయినా, ఏ నేరానికి శిక్ష అయినా, ఏ ప్రవర్తనకు పర్యవసానమయినా – అన్నీ ఈ లోకంలోనే – మరో లోకం లేదు. మరే న్యాయస్థానం లేదు.

అలాంటప్పుడు ఏ నైతిక నియమానికీ కట్టుబడి నిలబడనవసరం లేదు, ఏ శక్తికీ భయపడి బతకనవసరం లేదు.

ఈ భ్రమలలోనే బతుకు వెళ్ళదీస్తున్నాడు వంచిత మానవుడు. మనిషికి, అతని వ్యక్తిత్వమే చాలు ప్రభుజ్ఞానాన్ని బోధించడానికి.

సృష్టిలోకెల్లా ఉత్తమమయిన తీరులో అలరారే మనిషి తనువు, మనసు, మస్తిష్కాలు ఏమని చెబుతున్నాయి ?

వీటి సృజన వెనుక కృపాళుడయిన దాత అనుగ్రహించిన అసంఖ్యాక వరాలున్నాయన్న సత్యం ద్యోతకమవడం లేదా? వరాలు ఇచ్చిన వాడు వాటిని గురించి ప్రశ్నించడం సమంజసం కాదా?

ఇష్టమయినట్లు ఆచరించే స్వేచ్ఛ అధికారాలు ఇచ్చినప్పుడు సత్కార్యానికి బహుమానం, దుశ్చేష్టకు శిక్ష లభించాలన్నది న్యాయం కాదా?

ఇవన్నీ సదా మనిషి కళ్ళ ముందే కానవస్తున్న సత్యాలు. అలాంటప్పుడు ప్రభువు విషయంలో, ఆయన న్యాయం చేసే విషయంలో ఏ అజాగ్రత్తకు ఏ వంచనకు గురికావడానికి హేతువు ఏదీ? ఆయన ఎలుగెత్తి చాటుతున్నాడు :

"మానవుడా! పరమోదాత్తుడయిన నీ ప్రభువును గురించి ఏ విషయం నిన్ను మోసంలో పడవేసింది? ఆయన నిన్ను సృజించాడు, నిన్ను నఖశిఖ పర్యంతం తీర్చి దిద్దాడు, నిన్ను సముచిత రీతిలో నిర్మించాడు, తనకు ఇష్టమయిన రూపంలో నిన్ను ఏర్పికూర్చాడు. ఏమీ కాదు – వాస్తవమేమిటంటే మీరు ప్రతిఫలాన్నీ, శిక్షనూ ప్రదానం చేసే దినాన్ని తిరస్కరిస్తున్నారు. నిజానికి మిమ్మల్ని కనిపెట్టుకుని ఉండేవారు నియమితులయి ఉన్నారు. వారు మీరు చేసే ప్రతి పనినీ ఎరిగిన ఆదరణీయ లేఖకులు."

(82 : 6-12)



# నిరంతర పయనం !

జీవితం ఓ పయనం - మనిషికో గమ్యం, బుద్ధికో మార్గం.

పృధ్విపై శ్వాస పీల్చగానే ప్రారంభమవుతుంది ఈ ప్రస్థానం.

బోసినవ్వులతో మొదలయి ఓనమాల మెట్లెక్కి మహా మస్తిష్కాలనే మైకంలో ముంచెత్తే చదువుల వరకు సాగే జ్ఞాన సముపార్జన;

నేల ఫలకాన గీట్లు పెట్టి మనోజ్ఞ మనోహరమయిన పంటల చిత్రాలు వెయ్యడంతో శ్రీకారం చుట్టి గగన తలాన గ్రహాలపైన మంగళం పాడాలని తలపెట్టే కృషి;

కత్తులతో కటార్లతో కుత్తుకలు రక్తసిక్తం చేసి తృప్తిచెందని నెత్తుటి దాహం అణు క్షిపణులతో మానవతనే మట్టుపెట్టాలని పన్నుతున్న కుట్ర - ఇదంతా ఏమిటి?

ఏమనుకుంటున్నాడీ మనిషి?

నా పయనం ఈ విశ్వపుటెల్లల్లో అంతమయిపోతుందని అనుకుంటున్నాడా? పదార్థ జ్ఞానం పుష్కలంగా సంపాదిస్తే పుడమిపైన ప్రాణి శాంతిని, సుఖాన్ని ఆనందాన్ని ఆస్వాదించగలుగుతుందని తలపోస్తున్నాడా??

ఇష్టం వచ్చినట్లు వ్యవహరించి, ఎందరో మాతృమూర్తుల్ని పుత్రవియోగంలో ముంచి ఎందరో ముత్తయిదువుల్ని విధవలుగా చేసి, ఎందరో భావితరం వారిని అభాగ్యులుగా, అనాధలుగా మిగిల్చి భువిపై వికటాట్టహాసం చేస్తూ నేలను నులిమి వేసేలా, నింగిని నేల చేసేలా సంచరిస్తూ ఉంటే అడిగే నాథుడే లేడని, అడ్డుకునేవాడు ఎవడని విర్రవీగుతున్నాడా ఈ మనిషి???

నీవేమని అనుకున్నా, ఎన్ని భ్రమలకు లోనయినా, నీకు ఇష్టమయినా, ఇష్టం కాకపోయినా నీవు నీ స్వామి వైపునకే బిరబిరా సాగిపోతున్నావు; ఆయన సమక్షంలోనే హాజరు కాబోతున్నావు, నీవు చేసిందంతా ఎదురు రాబోతోంది; తదనుగుణంగానే నీ తీర్పు జరగబోతోంది అంటున్నాడు పరమ ప్రభువు:

"మనిషీ ! నీవు మెల్లి మెల్లిగా నిరంతరాయంగా నీ ప్రభువు వైపునకు ముందుకు సాగిపోతున్నావు, ఆయన్నే కలవబోతున్నావు"

(84 : 6).

# జీవితం ఓ పరీక్ష !

పాపాయి! బోసినవ్వుల పాపాయి!!

తల్లి, తండ్రి, అన్నలు, అక్కలు, మామలు, తాతలు, పిన్నమ్మలు, బాబాయిలు - బంధువులందరి కంటి వెలుగుగా మెలిగే పాపాయి. కాని ఒక్క తండ్రి పోగానే, పాపాయి అనాధ!

బలాదూరయ్యే బంధువులు బహుదూరమయిపోతారు. నెత్తురు పంచుకు పుట్టిన తోబుట్టువులు దృక్కులు మార్చుకుంటారు. పాపాయి దిక్కులేని వాడవుతాడు - అనాధ! అడిగేనాధుడే లేనివాడు !!

అడిగే వారికే అభిమానంతో పెట్టేవారు లేనప్పుడు, ఆత్మాభిమానంతో చెప్పుకోలేక పడి ఉండే వారిని కనిపెట్టే వాడెవడు? పొరుగున ఆకలితో అలమటించే వారెందరో అని లెక్కపెట్టే వారెవరు?? తాను ఏమీ చెయ్యలేకపోయినా చెయ్యగలిగే ఆసామికి కబురుపెట్టే పుణ్యాత్ముడు ఏడీ? ఏమిటీ సమాజం??

మగువ హక్కుల కోసమని ఉపన్యాసాలకు కొదువలేదు. తమ ఇంట ఉన్న తోటి ఆడదాన్ని స్త్రీగా గౌరవించే మహిళామణులెందరు? వారికి చెందవలసిన హక్కుల్ని అందజేసే నీతిమంతులు ఎవ్వరు??

ఎన్ని నీతులు వల్లించినా, ఎంత నిజాయితీ ఉపదేశించినా సంపాదన సమస్యరాగానే ధర్మాధర్మాలను బేరీజువేసే ధర్మాత్ముడెక్కడ? ఏ విధంగానయినా ఆదాయం కలగాలి, ధనం పెరగాలి!



ఎందుకు? ఇదంతా ఇలా ఎందుకు జరుగుతోంది? ఆశ! ధన పిపాస!!

ఇది మనిషిలోని భౌతికారాధనా ప్రభావం, ప్రపంచ వ్యామోహ ఫలితం - ఎవరి హక్కుల కోసమూ ధనం వ్యయం కారాదు - మన హక్కుల ధనం మటుకు నలువైపుల నుండి చేరాలి. అంతా మనకే మిగలాలి.

ధన ధాన్యాలు సకల సంపదలు లభిస్తే దైవం గౌరవం ప్రసాదించాడని మనిషి పొంగిపోతాడు, లేకపోతే కుంగిపోతాడు - ధన సంపదలే, ఉన్నత పదవులే, హెూదాలే గౌరవాదరణలకు ప్రమాణాలయినట్లుగా !

ఎంత మోసంలో పడ్డాడు మనిషి! దైవం పరీక్షిస్తున్నాడని మరచిపొయ్యాడు. కలిమిలో తృప్తిచెంది కృతజ్ఞతాభావంతో తన దాత హక్కుల్నీ, తోటి సోదరుల హక్కుల్నీ నిర్వర్తిస్తున్నాడా లేదా అన్నది పరీక్ష ! లేమిలో ఓరిమి వహించి, ఉన్నదానితో సంతృప్తితో న్యాయం, నీతి, ధర్మం పరిధుల్లో జీవికకై కృషి చేస్తాడా లేక అన్ని హద్దుల్ని అతిక్రమించి వ్యవహరిస్తాడా అన్నది పరీక్ష !!

గౌరవానికీ, అగౌరవానికీ ప్రమాణం, డబ్బు హోదాలు కావు, నీ నైతిక జీవన సరళి! అది తెలుసుకోలేని మానవుడి పోకడ ఎలా ఉంది? –

"మనిషి పరిస్థితి ఏమిటంటే, అతని ప్రభువు అతన్ని పరీక్షిస్తూ గౌరవాన్నీ వరాలనూ అనుగ్రహిస్తే 'నా ప్రభువు నన్ను సత్కరించాడు' అని సంబరపడతాడు. ఆయన అతన్ని పరీక్షకు గురిచేసి జీవనోపాధి దుర్లభం చేసివేస్తే 'దేవుడు నన్ను అవమానం పాల్జేశాడు' అని వాపోతాడు."

*(దివ్యఖుర్ఆన్ 89 : 15, 16)*



# శృంఖలాలు తెంచాలి !

మూఢత్వంలో, అజ్ఞానంలో మగ్గుతున్న మనిషికి, సనాతనత్వాన్ని పట్టుకుని ప్రాకులాడే మూర్ఖులకు సంఘ సంస్కరణ అంటే ఏమాత్రం పడదు.

శతాబ్దాల తరబడి సమాజంలో, నాగరికతకే మచ్చగా పరిణమించిన మూఢాచారాలంటే వారికి వల్లమాలిన మక్కువ.

తమ తరతరాల సంప్రదాయాలంటే – అవి ఎన్ని అసమంజస వైఖరుల ముండ్లకంపలయినా సరే – హద్దులు మీరిన అభిమానం, దురభిమానం! 'సంస్కరణ' అన్న మాట వినగానే ఈ చీకటి జీవులు బిత్తర పోతారు, గగ్గోలు పెడతారు.

"సమాజంలో మహిళలకు న్యాయవంతమయిన స్థానం కావాలి; ఆడ పిల్లకు ఆస్తిహక్కు కావాలి; వితంతువుకు పునర్వివాహ సౌలభ్యం కావాలి; ఆడవారికి విడాకులు పొందే, విడాకులు ఇచ్చే అధికారం కావాలి; ఋతుకాలంలో స్త్రీ అపరిశుద్ధురాలనడం మూర్ఖత్వం" అని స్త్రీకి సహజసిద్ధమయిన స్థానాన్ని ఇవ్వదలిస్తే మూర్ఖత్వపు ముసుగులు వేసుకున్న పెద్దలు ససేమిరా ఒప్పుకోరు, గుడ్డిగా ప్రతి సంస్కరణాచర్యను వ్యతిరేకిస్తారు.

మూఢనమ్మకాల ఊబిలో కూరుకుపోయి, శునక శాస్త్రాలు, మార్జాల శాస్త్రాలు సృష్టించుకుని, పునాదుల్లేని పేకమేడలు కట్టుకుని జీవించేవారు భగ్గున మండిపడతారు. దిగ్గున లేచి సంస్కరణా జ్యోతుల్ని ఆర్పివెయ్యాలని ఉద్యమిస్తారు.

జీవితంలో అడుగుతీసి అడుగు వెయ్యాలంటే అలవికాని భారంగల సంకెళ్ళు కాళ్ళకు వేసుకుంటారు. తలపై కెత్తి తిరగాలంటే వీలుపడని గుదిబండలు మెడకు వ్రేలాడ దీసుకుంటారు. చెయ్యిచాచి కావలసినవి పొందాలంటే చేతులకు వెనక్కిలాగే బేడీలు వేసుకుంటారు. వీరు జీవితాల్లో సృష్టించేవి- అడుగడుగునా అవరోధాలు, అనుక్షణం అవాంతరాలు.

ప్రభువు మానవుడిపై నుంచి ఈ శృంఖలాలను తొలగించి, ఈ బలహీనుడి భారమయిన బతుకును సులభతరం, సరళతరం చెయ్యగోరు తున్నాడు.



ప్రభువు మానవుడిపై నుంచి ఈ శృంఖలాలను తొలగించి, ఈ బలహీనుడి భారమయిన బతుకును సులభతరం, సరళతరం చెయ్యగోరుతున్నాడు.

"సజ్జనులయిన వారు సతతం అనుసరిస్తూ వచ్చిన పద్ధతులనే మీకు విశదపరచాలని, ఆ పద్ధతులపైనే మిమ్మల్ని ఆచరింపజెయ్యాలని దైవం కోరుకుంటున్నాడు. ఆయన తన కారుణ్యంతో మీపట్ల శ్రద్ధ చూపాలని సంకల్పిస్తున్నాడు. ఆయన అన్నీ తెలిసినవాడు, వివేచనాపరుడూను. నిజమే, ఆయన తన కారుణ్యంతోటే మీపట్ల శ్రద్ధ చూపదలిచాడు. కాని తమ మనోకాంక్షల దాస్యంలో తలమునకలయి ఉన్నవారు, మీరు సన్మార్గానికి దూరంగా తొలగిపోవాలని కోరుకుంటున్నారు. దైవం మీపై ఉన్న బంధనాలను తేలికపరచాలని కోరుకుంటున్నాడు – ఎందుకంటే మానవుడు తన సృష్టిరీత్యా బలహీనుడు."

*(4 : 26 – 28)*



# క్రియాశూన్యులు!

మనిషికి ప్రపంచంలో మిక్కిలి ప్రియమయిందేమిటి అనడిగితే టక్కున చెబుతాడు – 'భవిష్యత్తు' – అని. అంధకారంలో ఉండే ఈ భవిష్యత్తులోకి తన అంచనాల టార్చిలైటు వేసి అక్కడేముందో తెలుసుకోవాలని ఎంతో తాపత్రయపడతాడు మనిషి. కాని ఈ టార్చి అతన్ని సదా మోసంలో ముంచివేస్తుంది.

హస్త సాముద్రిక విద్య లాంటిది మొదలుకుని చిలక జోస్యం, గద్దె చెప్పించుకోవడం, బరువు తూచే యంత్రం అందచేసే కార్డు వరకు, భావి జీవితంలోకి మనిషి తొంగిచూసేందుకు చేసే ప్రయత్నాలు ఎన్నెన్నో!

అంతేకాదు తన అదృష్ట దురదృష్టాలకు తుమ్ముతో, దగ్గుతో, మాటతో, పిల్లితో, కుక్కతో, వితంతువుతో, చివరికి ఆకాశంలోని చుక్కలతో ముడివేసి అలా జరగడానికి, ఇలా జరిగిందానికి అన్నింటికీ కారణం వీటిలోనే వెదుక్కుంటాడు. తన అసమర్థతను, తన క్రియా శూన్యతను నిందించకుండా అంతా వీటిపైకి నెట్టేసి, ఏదో సర్దిచెప్పుకుని తృప్తి చెందుతాడు. ఇలా ఆత్మవంచనకు గురయి క్రియాశీలతకు దూరమవుతాడు.

నిజానికి మనిషిలోనే ఉంది అతని సౌభాగ్యమయినా, దౌర్భాగ్యమైనా! మనిషి తన లక్షణాలతో, గుణగణాలతో, తన స్వభావాలతో, తన విచక్షణా జ్ఞానంతో, తన నిర్ణయ శక్తితో, తన వైఖరితో, తన ఆచరణతో – తన జీవితంలో శుభా శుభాలను రచించుకుంటాడన్నది యదార్థం.

బాహ్యంలో భాగ్యం కోసం దేవులాడే వారిని అమాయకులని అనడం కంటే అవివేకులని అనవలసి ఉంటుందేమో!

తమ భవితవ్యం వ్రాసి తమలోనే దాచుకున్న ఈ మనుషులు కాస్త తలవంచి ఆంతర్యంలోకి తొంగిచూసుకుంటే అక్కడ కానవస్తుంది వారి ఎడల సంభవిస్తున్న దానికి అసలు హేతువేమిటో!!



తమను సర్వనాశనం చేసిందేమిటో అది మనిషికి తనలోనే స్పష్టంగా దర్శనమిస్తుంది – అంతర్ చక్షువుతో వీక్షిస్తే. అదే అంటున్నాడు పరమ ప్రభువు:

"ప్రతి మనిషికి చెందిన మంచీ  చెడుల శకునం మేము అతని కంఠంలోనే వ్రేలాడదీశాము.  ప్రళయ దినాన ఒక లిఖిత పత్రాన్ని మేము అతనికై వెలికి తీస్తాము.  అతను దాన్ని తెరచిన పుస్తకంలా చూస్తాడు– 'చదువుకో నీ కర్మ పత్రాన్ని, నీ లెక్క చూసుకోవడానికి నేడు నీవే చాలు' (అని అప్పుడతనితో చెప్పడం జరుగుతుంది)."  (17 : 13, 14)



# తొందరపాటు!

గ్రీకు జాతి అత్యున్నత సంస్కృతీ నాగరికతలకు ఆలవాలమయి విరాజిల్లింది; ఈజిప్టు ప్రజలు అత్యున్నత సాంకేతిక పరిజ్ఞానంతో అత్యుత్తమ నాగరికతా వైభవాలతో అలరారారు. రోమను సామ్రాజ్య ప్రాభవం ప్రపంచాన్నే జయించాలని కలలుగన్నది. కాని ఏమయింది?

ఆ జాతుల గత గాథనంతా చెప్పడానికి నేడు శిధిలాలే మిగిలాయి. ఆ సంస్కృతీ నాగరికతల గొప్పదనాలన్నీ మటుమాయమయ్యాయి. నేడు వాటి స్థానే కొత్త సంస్కృతీ నాగరికతలు తిష్టవెయ్యగా కుమిలి కుమిలి ఏడ్వడానికి వాటి స్మృతులు మటుకు మిగిలాయి.

నైతిక పతనానికి పర్యవసానంగా ప్రకృతి విజృంభిస్తే తిరిగి తట్టుకుని సర్దుకునే అవకాశం కూడా లభించదు. అందువల్ల గతం నుంచి నేర్చుకోవలసిందెంతో ఉందని చెబుతారు.

మనిషిని మంచి వైపునకు ప్రేరేపించడానికి, అతనిలో చెడు పట్ల ఏవగింపు కలగజెయ్యడానికి అతనికి ఎదురవబోయే ప్రమాదాన్ని గుర్తు చేస్తారు. నైతికతకు విలువనివ్వని జాతులు ఎలా నాశనమవుతాయో చెప్పడానికి గత జాతుల గాథలు వినిపిస్తారు.

అయితే అవహేళన చేసేవారు, ఏదీ ఆ ప్రకృతి విధించే శిక్ష ఇంకా రాదేమిటి? అని వెక్కిరిస్తారు. కాని అదే గనక దాపురిస్తే హాహా కారాలు మొదలెడతారు.

ఎన్ని తుఫానులు, ఎన్నెన్ని ఉప్పెనలు, ఎన్ని వరదలు, ఎన్ని భూకంపాలు - మన కళ్ళెదుట ఎన్ని శిక్షలు విధించడంలేదు ప్రకృతి?! కళ్ళుంటే గదా తెరచుకోడానికి?

ఆ శిక్షకై వేగిర పడకుండా మంచి కోసం తాపత్రయ పడితే ఎంత సుఖం? ప్చ్, ఏం లాభం? మనిషి తత్వమే అలాంటిది.

*"మనిషి ఏ విధంగానయితే మంచి కొరకు అర్థించాలో ఆ విధంగా చెడు కావాలని కోరుకుంటాడు. మనిషి నిజానికి ఎంతో తొందరపాటు జీవి."*



*( 17 : 11)*



# అల్ప హృదయం!

మనుషులందరూ తమ పుట్టుక రీత్యా హక్కుల దృష్ట్యా సమానులే. కాని శక్తి సామర్థ్యాల రీత్యా, బుద్ధి వివేకాల దృష్ట్యా అసమానులు !

కొందరు ఓ రంగంలో నిష్ణాతులయితే మరి కొందరు మరో రంగంలో నిపుణులు. అన్నింటిలో ఆరితేరిన వారు చాలా కొద్దిమందయితే అందరికీ మార్గదర్శకులయ్యేవారు ఏ ఒకరిద్దరో పుడతారు.

మానవుల మనుగడకు ఏ వస్తువు ఎంతగా అవసరమవుతుందో అంతే లభిస్తుంది ప్రపంచంలో.

గాలి, నీరు పుష్కలంగా కావాలి, అవి లేనిచో పే లేదు. ఆహారం బతుకుకు అత్యవసరం, అది సమృద్ధిగా లభిస్తుంది.

శ్రామికులు, కర్షకులు, కార్మికులు ఎందరో కావలసి ఉంటే, సాంకేతిక నిపుణులు, ఇంజనీర్లు, డాక్టర్లు, టీచర్లు అంతమంది అవసరముండరు.

అలాగే ఆయా రంగాల్లో ఆవిష్కర్తలు, అసాధారణ ప్రజ్ఞావంతులు శతాబ్దికొకరు ఆవిర్భవిస్తారు.

ఈ వైవిధ్యం, ఈ ఆవశ్యకతాప్రధానమయిన శక్తి సామర్థ్యాల పంపిణీ, ఈ అవసరాల కనుగుణమైన ఏర్పాట్లు విశ్వప్రభువు తరఫున సదా జరుగుతూ ఉంటాయి.

ప్రాపంచిక భోగభాగ్యాల మాదిరిగానే ఈ శక్తి సామర్థ్యాల, బుద్ధీ వివేకాల సౌభాగ్యమూ విశ్వ వ్యవస్థ బృహత్తర పథకంలో భాగంగా మనుషులకు సంప్రాప్తమవుతూ ఉంటుంది.

విశ్వప్రభువు చేసే ఏర్పాట్ల రీత్యా లభించే ఈ వరప్రసాదాలను సౌజన్యంతో, సౌమనస్యంతో స్వీకరించి తృప్తి చెందడంలోనే మానవుని గొప్పదనముంది.

తనకృషితో, శక్తిసామర్థ్యాలకు బుద్ధీ వివేకాలకు సానబట్టి సాధ్యమయినన్ని సోపానాలు ఎక్కరాదని, వీలయినన్ని దూరాలకు సాగిపోరాదని దీని అర్థం ఏ మాత్రం కాదు. అది జరగవలసిందే.

అయితే సమకాలీనతా ద్వేషంతో రగిలిపోవడం, ఈర్ష్యాజ్వాలల్లో మాడిపోవడం సంకుచిత బుద్ధిని, సంకుచిత మనస్సును, సంకుచిత దృష్టిని వ్యక్తం చేస్తుంది. ఈ తత్వం ఎదుటివారి గొప్పదనాన్ని, ఘనతను అంగీకరించటంలో అడ్డు వస్తుంది.

ఇలాంటి అల్ప హృదయులయిన వారికి విశ్వ వ్యవస్థలోని సకల వరప్రసాదాలు అప్పజెప్పి పంచిపెట్టమంటే ఏ ఒక్కరికీ ఓ చిల్లిగవ్వ కూడా దక్కకుండా చేస్తారంటున్నాడు ప్రభువు:

*"ఓ ప్రవక్తా , వీరితో చెప్పండి, నా ప్రభువు కారుణ్య భాండాగారాలు మీ అధీనంలో ఉన్నట్లయితే, ఖర్చయిపోతాయన్న భయంతో, ఎవ్వరికీ ఇవ్వకుండా నిల్వజేసి ఉంచేవారు మీరు. ఎంత నిజం! మనిషి ఎంతో సంకుచిత మనస్కుడు." (17 : 100)*



# మనిషి మరచిన హేతువు!

మనిషి ప్రపంచంలో పాల్పడే అఘాయిత్యాలకు, అకృత్యాలకు, అన్యాయాలకు, అక్రమాలకు, దౌష్ట్యాలకు, దౌర్జన్యాలకు, అసలు కారణం జీవితం పట్ల అతని దృక్పథమే.

జీవితం అంటే ఈ ప్రాపంచిక జీవితమే, ఇదే తప్ప మరేదీ లేదు; చచ్చి, చెట్లూ చేమల్లా, పురుగూ పుట్రల్లా, మట్టిగా మారడమే కాని మరేమీ లేదు అన్న దృక్పథం కారణంగానే మనిషి ఆ విధంగా రూపొందుతాడు.

ఇహమే తప్ప పరం లేనప్పుడు మనిషి సత్యం కోసం, ధర్మంకోసం, న్యాయం కోసం, బాధపడవలసిన అవసరమేమిటి? ఏమి బావుకోవడానికో ఇతరులకై త్యాగం చెయ్యవలసింది!

దయ, సేవ, ప్రేమ, కరుణ, అనురాగం, వాత్సల్యం - హుష్ - అన్నీ బూటకాలు. వ్యర్థమయిన పదజాలం!! ప్రపంచాన్ని, అందులోని సుఖసంపదల్ని, రుచుల్ని, మజాని ఎంతగా వీలయితే అంతగా జుర్రుకోవాలి!!

ఈ భావం బాగా తలకెక్కిన తరువాత రుచి మరిగిన మనిషి తన వాదనకు, తన దృక్పథానికి అసంఖ్యాకమయిన ఆధారాలు వెదికి తెస్తాడు, వాటిని తానూ నమ్మడానికి ప్రయత్నిస్తాడు, ఇతరుల్నీ నమ్మించడానికి యత్నిస్తాడు. అంటే ఆత్మవంచనకూ, పరవంచనకూ ఒడిగడతాడన్నమాట.

కాని సత్యం యదార్థరూపం ధరించి అతని ఎదుట సాక్షాత్కరించిననాడు అతని ఎత్తులు, జిత్తులు, వాదనలు, తర్కాలూ అన్నీ కట్టిపెట్టవలసి వస్తుంది.

ఆ పరిస్థితి రాక పూర్వమే హేతుబద్ధంగా ఆలోచించి తన పుట్టు పూర్వోత్తరాలను గురించి యోచిస్తే, తన ఉనికిపట్టుకు మూలమేదో తలపోస్తే మనిషి వాస్తవాన్ని గ్రహించగలడు.

ఆ మాటే అంటున్నాడు స్వామి:

"మనిషి 'అవునూ, వాస్తవంగానే నేను మరణించిన తరువాత, నన్ను బ్రతికించి లేపడం జరుగుతుందా?' అని ఎగతాళిగా ప్రశ్నిస్తున్నాడు. మనిషికి

గుర్తురావడం లేదా? అంతకు పూర్వం అతను అసలు ఏమీ కాని 'లేమి' స్థితిలో ఉండగా మేము అతన్ని 'ఉనికి'లోకి సృజించామే! నీ ప్రభువు సాక్షి, మేము వీరందరినీ, వీరితోపాటు వీరి గురువులైన షైతానులనీ చుట్టుముట్టి తీసుకు వస్తాము. నరకం చుట్టూ తిప్పుకు వచ్చి వారిని మోకాళ్ళపై కింద పడవేస్తాము." (19 : 66-68)



# తొందర పడకు!

అకస్మాత్తుగా 'అన్నపూర్ణ' అనిపించుకున్న నేల అక్కరకు రానిదిగా మారిపోతుంది. కటిక కాటకం చుట్టుముట్టుతుంది. రెండు మెతుకులు కడుపులో వేసుకోవడమే ప్రజలకు కనాకష్టమయిపోతుంది.

అంతలోనే వరదలు ముంచుకు వస్తాయి. ఎంతో కష్టంగా వేసుకున్న పంటలూ, పైర్లూ ఒక్క దెబ్బతో కొట్టుకుపోతాయి. అపార ధన ప్రాణ నష్టం వాటిల్లుతుంది.

మరొకప్పుడు అంటువ్యాధి తుఫానులా ప్రవేశించి చిన్ననక, పెద్దనక, మంచివారనక చెడ్డవారనక ఎందరినో తుడుచుకుపోతుంది. ఎన్ని ముందు జాగ్రత్తలు తీసుకున్నా అన్నీ ఆ మహమ్మారి సమక్షంలో వ్యర్థమయిపోతాయి.

ఇంకోసారి భూకంపం ఒక్కసారిగా వచ్చి అంబరాలను చుంబించే హర్మ్యాలను నేలమట్టం చేస్తుంది. గొప్ప గొప్ప పథకాలు, ప్రణాళికలు త్రుటిలో నామరూపాల్లేకుండా నమసిపోతాయి.

ఒక్కోసారి శీతల ప్రభంజనాలు ఊపిరినే ఘనీభవింపజేస్తే, మరోసారి వడగాడ్పులు ప్రాణాలనే ఎగరేసుకుపోతాయి.

జీవితంలో ఏమేమో జరుగుతూ ఉంటుంది. మనిషి చేసినదంతా అసలు ఉనికిలోకే రాలేదన్నట్టుగా మాయమయిపోతుంది. లక్షలాది మానవులు అసువులుబాస్తారు.

నాగరికతల్తో అలరారే మహా నగరాలు సర్వనాశనమయిపోతాయి. సస్యశ్యామలంగా, మనోహరంగా కనులపండుగ చేసే చేలూ పొలాలూ భూగర్భంలో కలిసిపోతాయి.

ఇవన్నీ గమనిస్తూనే ఉంటాడీ మానవుడు.

కాని ఓ బలవత్తర శక్తి ఈ విశ్వ వ్యవస్థను నిర్వహిస్తూ ఉందంటే నమ్మడు.

ఆ శక్తి తలచుకుంటే దాన్ని తిరస్కరించే వారిపైకి ఇంతకంటే ఘోరమయిన విపత్తుల్ని తీసుకురాగలదంటే నవ్వుతాడు.

తిరస్కరించే వారికి తీర్పు దినం భరింపరానిదిగా ఉంటుందంటే అపహాస్యం చేస్తాడు.

తిరస్కరించే వారు ఆ మహాగ్నిలో సమిధలవుతారని అంటే అవహేళన చేస్తాడు.

"చాలు, చాలు, నేను అనుదినం తిరస్కరిస్తూనే ఉన్నాను. అయినా హాయిగా ఠీవిగా మీసం మెలేసి మరీ తిరుగుతూనే ఉన్నాను. శిక్షా కానరాదు, ప్రళయ రావమూ వినపడదు, ఇక ఆ నరకం వాసన అంతకన్నా గోచరించదు" అని అట్టహాసం చేస్తాడు.

ఈ తొందరపాటుపై ప్రభువు ఏమంటున్నాడో:

"మనిషి నిజానికి చాలా తొందరపాటు సృష్టి. ఇప్పుడే మీకు నేను నా నిదర్శనాలను చూపెడతాను, తొందరపెట్టకండి." *(21 : 37)*



# ఆయనకన్నీ సుసాధ్యమే!

ఒక బిందువు. అందులో కంటికి నేరుగా కానరాని క్రిములు. వాటిలో నుంచి ఎన్నికయిన ఓ క్రిమి. గోరంతది పండి, పిసరంతయి, రక్తపు ముద్దలో తడిసి, మాంసపు ముద్దగా తయారయి, ఎముకల గూడు కట్టుకుని, కండరాలు తొడుక్కుని, వేలెడంతది పెరిగి జానెడంతయి, మూరెడంతయి, మారు పలకని స్థితి నుండి మారాము చేసేంతగా ఎదిగి ఇప్పుడు కన్నెర్రచేస్తోంది ఈ ప్రాణి - మానవుడనే ఈ జీవి!

భువిలోని జీవరాసుల్లా ప్రకృతి ధర్మాలకు లోబడిన శరీరమే మానవ శరీరం. మనిషి నలువైపులా సంచరిస్తాడు. తన మనుగడకై అనునిత్యం శ్రమిస్తాడు. బ్రతుకు తెరువుకై అనుదినం గాలిస్తూ తిరుగుతాడు, కష్టపడనిదే ఇష్టమయిన తిండి సంపాయించలేడు.

అయితే మనిషిదో ప్రత్యేకత.

మరే జీవికీ లేని బుద్ధీ వివేకాలున్నాయతనికి. ఆలోచించగలడు. మంచీ చెడుల మధ్య విచక్షణ చూపగలడు. తనకు నచ్చిన బాటను ఎన్నుకోగలడు. తామెచ్చుకున్న దాన్ని తన సొంతం చేసుకోగలడు. సృష్టిరాశిపై ఒకింత అదుపు, ప్రకృతి శక్తులపై ఒకింత ఆధిపత్యం అతనికి ఉన్నాయి.

బుద్ధీ జ్ఞానాల నుపయోగించుకుని మనిషి ప్రకృతి రహస్యాలు తెలుసుకోగలడు, వాదోపవాదాలు చెయ్యగలడు. తోటి మనుషులతోనే కాదు చివరికి తన సృష్టికర్తతోనూ వాదించడానికి తయారవుతాడు.

తలెత్తి ప్రశ్నిస్తాడు. సవాళ్ళు విసురుతాడు. తనకున్న పరిమిత శక్తులనే అపారమయినవిగా, అఖండనీయమయినవిగా తలపోస్తాడు, 'ప్రచండ శక్తిమాన్యుడ'నయిన తాను చెయ్యలేనిది మరే శక్తి సాధించగలదని విర్రవీగుతాడు

'నేనే ఓ మృత జీవిని బతికించలేనపుడు మరే శక్తికయినా అది ఎలా ధ్యమవుతుంది' అని సవాలు చేస్తాడు. ఎగతాళి చేస్తాడు, కాని తన్ను

గురించి, తన పుట్టుకను గురించి, తన వాస్తవిక స్థితిని గురించి ఓ క్షణం ఆలోచించడు. మనిషి అవలంబించే ఈ దౌర్భాగ్యపు వైఖరినే ప్రభువు ప్రస్తావిస్తున్నాడు:

"మానవుడు చూడటం లేదా - మేము అతన్ని రేతస్సు నుండి సృజించగా ఆపైన అతను వచ్చి జగడాలకోరుగా తయారయ్యాడే! ఇప్పుడతను మాకు పోలికలు ఆపాదిస్తున్నాడు. తన పుట్టుకనే మరచిపోతున్నాడు. 'కృశించిపోయిన ఈ ఎముకల్ని తిరిగి బ్రతికించే వాడెవడు' అని ప్రశ్నిస్తున్నాడు. అతనితో చెప్పండి, 'ఎవరయితే వాటిని ప్రప్రథమంగా (అవేవీ లేనప్పుడు) సృజించాడో ఆయనే వాటిని బ్రతికిస్తాడు. ఆయన సృష్టికి సంబంధించిన ప్రతి విషయం తెలిసినవాడు' అని." (36 : 77 - 79)



# కృతఘ్నుడు మనిషి!

మనిషికి మరుపు ఎక్కువ. ముఖ్యంగా చేసిన మేలును మరువడం ఎంతో సులువు మనిషికి! మనిషి అవలంబించే ఈ వైఖరినే కృతఘ్నత అనంటాము. ఈ కృతఘ్నత తోటి మానవ సోదరుల ఎడల కానవస్తూనే ఉంటుంది. కాని పుట్టుక నిచ్చిన స్వామి విషయంలోనూ అది దర్శన మివ్వడంలోనే ఉంది మానవుని ఘనత!! ఇలాంటి మనిషి మానవత్వపు విలువల నెరగనివాడు. ఇలాంటి వారిదే ఈ ప్రస్తావన.

కష్టకాలం వచ్చిందంటే మనిషి ఓ క్షణం కూడా సహనం చూపలేడు. బేజారెత్తిపోతాడు. తనకు సాధ్యమయిన యుక్తులన్నీ ప్రయోగించి ఆ ఆపద నుండి బయటపడడానికి ప్రయత్నిస్తాడు.

తను చేసిన ఉపాయాలేవీ ఆ అపాయం నుండి గట్టెక్కించలేకపోతే అనేక దేవీ దేవతల వెంటబడతాడు.

అదీ ఫలించకపోతే – అప్పటికిగాని కళ్ళపైన ఉన్న మబ్బు పొరలు విచ్చుకోవు. అప్పుడు కళ్ళు కనలేని స్వామి, విశ్వకర్త, ఏకైక దైవం వైపునకు మరలుతాడు. ఆయనకు మొరపెట్టుకుని తన కష్టాలను కడతేర్చమని అర్థిస్తాడు.

అప్పుడు అతని మనసులోని మనసు సాక్ష్యం పలుకుతుంది, తాను ఇంతకాలం పిలుస్తూ వచ్చిన దైవ ప్రతీప శక్తులన్నీ తనకు ఏమీ ఒరగబెట్టలేవని, అవన్నీ వట్టి మిథ్యాదైవాలే అని, అసలు అధికారాలన్నీ ఏకైక దైవం అధీనంలోనే ఉన్నాయని.

ఆ తరువాత అతని స్వామి అతనికి వరాలను ప్రసాదించగా గతం అతని కళ్ళనుండి మరుగయి పోతుంది. తిరిగి చిల్లర దేవుళ్ళ ఉపాసనా బద్ధుడయిపోతాడు. తాను స్వయంగా మార్గం తప్పడమే కాక ఇతరుల్ని సయితం అపమార్గం పట్టిస్తాడు.

లేదా – తనకు ప్రాప్తమయిన వరాలు దైవానుగ్రహం వల్ల కాదని, తన శక్తి సామర్థ్యాల మూలంగా, తన యోగ్యత, అర్హతల కారణంగా లభించాయని ప్రగల్భాలు పలుకుతాడు.

దైవం ఎదుట వినమ్రుడవడం, ఆయన విధేయత పాటించడం తనకు అవమానకరమని తలపోస్తాడు. అలాంటి వాని గురించే ప్రభువు సెలవిస్తున్నాడుః

"మనిషికి మేము ఉపహారమిచ్చి సత్కరిస్తే అతను ముఖం త్రిప్పుకుని తల బిరుసుగా వ్యవహరిస్తాడు. మరెప్పుడయినా, ఏదయినా ఆపద వచ్చి ముట్టుకుంటే చాలు సుదీర్ఘమయిన ప్రార్థనలు చెయ్యడం మొదలెడతాడు."

*(41 : 51)*



# ...ఇరువురూ సమానులేనా?

దేవుడు అసలు లేడని తిరస్కరించడం ఒకటే 'తిరస్కారం' అనిపించుకోదు. విశ్వ ప్రభువును కాదని అనేక ఇతర శక్తుల్ని దైవం అనీ లేక దైవ సమానమని, పూజనీయమైనవనీ భావించడం, అలా ఆచరించడం కూడా తిరస్కారమే – ఎందుకంటే, నిజప్రభువును కాదని ఇతరుల్ని కూడా ఆయన ప్రభు సత్తాలో భాగస్వాములుగా భావించడమంటే ఆయన అసలు ప్రభుసత్తాక అధికారాన్ని సవాలు చెయ్యడమే అన్నమాట!

కష్టకాలంలో ఏదో ఆపద్ధర్మంగా గత్యంతరంలేక దైవాన్ని సంస్మరించి ఆయన సహాయాన్ని అర్థించడం, ఆ ఆపద తొలిగిన వెంటనే తిరిగి చిల్లర శక్తుల్ని దైవాలుగా భావించి మొకరిల్లడం దైవ తిరస్కార వైఖరిగానే పరిగణించవలసి ఉంటుంది.

ఇలా కష్టకాలంలో కాక సదా ఒకే స్వామిని, నిజప్రభువుని ఉపాసించడం, ఆరాధించడం, ఆయన ఆజ్ఞల్నే పాలించడం, పగటి వెలుగులోనే కాక రాత్రి చీకటిలోనూ, ఏకాంత సమయాల్లోనూ నిజ ప్రభువు ఉపాసనలో నిమగ్నులయి తమ భక్తిప్రతిపత్తులను ఆయన ఎదుట సమర్పించుకోవడం నిజమయిన దైవోపాసకుల, దైవభక్తుల, దైవదాసుల లక్షణం.

కష్టకాలంలో మటుకే దైవం వైపు మరలే వారు నిజానికి అజ్ఞానులు, మూఢులు, మూర్ఖులు – వారెన్ని శాస్త్రాలు మథించి, ఎన్ని తత్వాలు రంగరించి, ఎన్ని విద్యలు నేర్చి, ఎన్ని గ్రంథాలు తాగేసినా – నిజస్వామిని తెలుసుకోలేకపోయిన వారి జ్ఞానం అర్థరహితం, వారు అజ్ఞానులే.

సతతం సత్ప్రభువును ధ్యానించేవారు, ఆయనకే విధేయులయినవారు, ఆయన సమక్షానే నుదుటిని నేలవాల్చేవారు – విజ్ఞులు, జ్ఞానులు, వివేచనాపరులు.

చదవనూ వ్రాయనూ తెలియని వారయినా, ఏ శాస్త్రాలూ ఎరగని వారయినా – అసలు యదార్థాన్ని తెలుసుకున్న వారి అంతర్యం, ఆ తెలివిడికి అనుగుణంగా ఆచరించే వారి జీవితం ధన్య జీవితం. వీరిరువురూ

సమానులు కాగలరా? ఇరువురూ ప్రపంచాన ఒకే విధానాన బతకడం, ఆ తరువాత పరలోకాన ఒకే విధమయిన పర్యవసానాన్ని ఎదుర్కోవడం సమంజసమా? అలా జరగడానికి వీల్లేదు. అదే అంటున్నాడు విశ్వప్రభువు:

"మనిషిపై ఆపద విరుచుకు పడినప్పుడు అతడు తన ప్రభువు వైపునకు మరలి ఆయనకే మొరపెట్టుకుంటాడు. అతని ప్రభువు తన వరాలనిచ్చి అతన్ని ఆదరిస్తే తాను మొరపెట్టుకున్న ఆపదను మరచిపోతాడు. ఇతరుల్ని దైవానికి సమానులుగా పరిగణిస్తాడు...(మరో వ్యక్తి), దైవ విధేయుడయిన వాడు, రాత్రి ఘడియల్లో దైవారాధనలో నిలబడతాడు. సాష్టాంగపడతాడు. పరలోక పరిణామాలపట్ల భయపడతాడు. తన ప్రభువు కారుణ్యం పట్ల ఆశ కలిగి ఉంటాడు... వీళ్ళనడగండి, తెలిసిన వాడు, తెలియని వాడూ ఉభయులూ సమానం కాగలరా? - బుద్ధిగలవారే హితోపదేశాన్ని గ్రహిస్తారు".

(39 : 8,9)



# ఆయన ప్రేలుముడిని కూడా తిరిగి నిర్మిస్తాడు!

పుట్టినవాడు చనిపోవడం తథ్యం. ఎలా చనిపోతాడు, ఎక్కడ చనిపోతాడు ఎవరూ చెప్పలేరు.

చనిపోతే కాల్చివెయ్యడమో, కాలిపోవడమో జరుగుతుంది.

నేలలో పూడ్చిపెట్టడమో, పూడ్చుకుపోవడమో జరగవచ్చు.

నీట ముంచి వేసినా మునిగిపోయినా ఫలితం ఒక్కటే.

మనిషి చావు ఎలా సంభవించినా, చచ్చిన తరువాత అంత్యక్రియలెలా జరిగినా అతని శరీరం, ఎముకలూ అంతా కృశించి భువిలోని ధాతువుల్లో, ఖనిజాల్లో కలిసిపోవడం మటుకు తప్పదు. ఏ శరీరమూ సామాన్యంగా సదా 'నిల్వ' ఉండదు, ఉంచరు, ఉంచకూడదు కూడా.

అయితే అలా పంచభూతాల్లో కలసిపోయిన ఈ మానవ శరీరం మళ్ళీ బ్రతికి నిలబడుతుంది అంటే నమ్మలేక పోతున్నాడు మనిషి.

ఈ శరీరం – మట్టిఅయి, బూడిదయి, చేపల ఆహారమయి, ఏమీ మిగలకుండా, నామరూపాల్లేకుండా అంతమయిపోయిన శరీరం– తిరిగి లేచి నిలబడుతుందంటే నమ్మడం కష్టమే.

కాని ఇది తానుగా బ్రతుకుతుందని అనడం లేదు, నేను స్వయంగా బ్రతికిస్తానని అంటున్నాడు విశ్వకర్త. అదీ నమ్మడం కష్టంగా ఉందా?

ఈ విశ్వ వ్యవస్థను సృజించి నడిపించే నాథుడొకడు ఉన్నాడని, ఆయనే ఈ విశ్వాన్ని ఇందులో ఉన్న ఈ జీవకళను సృజించిన కళాకారుడని, ఆయనే ఈ మానవుడనే బుద్ధి జీవినీ సృష్టించినవాడు అనీ నమ్మే మనిషికి కూడా ఆయన సామర్థ్యం పట్ల నమ్మకం కుదరడం లేదా?

మనిషికి అసలు ఉనికే లేనప్పుడు, అనేక ముడిపదార్థాలు, ధాతువులు, లవణాలు, ఖనిజాలు, ఆమ్లాలు ఇంకా ఏమిటేమిటో మిశ్రమం చేసి మనిషిని రూపకల్పన జేసినవాడు, మనిషిని 'లేమి'లో నుండి 'ఉనికి'లోకి తెచ్చిన స్వామి, తిరిగి ఆ లవణాలను, ఖనిజాలను, ధాతువుల్ని ఇంకా ఇతర

పదార్థాలను కలిపి తిరిగి ఆ మనిషిని మలచలేడా? ఆ రూపురేఖలు తీర్చిదిద్దలేడా? అదే చెబుతున్నాడు ప్రభువుః

"మేము అతని ఎముకల్ని ప్రోగు చెయ్యలేమని మనిషి భావిస్తున్నాడా? అంతమటుకే కాదు, మేమయితే అతని ఒక్కొక్క వ్రేలిముడినీ సరిగ్గా అలాగే నిర్మించగల సామర్థ్యం గలవారము." (75ః3,4)





# కాంక్షల అభ్యంతరాలు

మనిషి స్వేచ్ఛా జీవి. తనపై ఎలాంటి ఆంక్షలుండటాన్ని సహించలేడు. ఎలాంటి అదుపు ఆజ్ఞల ఒత్తిడిలో ఉంటూ పని చెయ్యటానికీ ఒప్పుకోడు. ముఖ్యంగా తాను చేసే చర్యలకు ఎలాంటి నైతిక బాధ్యత అయినా తనపై పడకుండా జాగ్రత్తలు తీసుకుంటాడు.

అలాంటి మనిషి తాను చేస్తున్న ప్రతి పనికి, ప్రతి మంచికి, ప్రతి చెడుకి ఓ ఉన్నత శక్తి ముందు జవాబు చెప్పవలసి ఉంటుందని ఒప్పుకుంటాడా?

పగ్గంలేని ఆంబోతులా తిరగడమంటేనే అతనికి ఇష్టం.

తాను చేస్తున్న అన్యాయాలకు, అక్రమాలకు, అత్యాచారాలకు, దౌర్జన్యాలకు, దౌష్ట్యాలకు ఏమాత్రం అడ్డు చెప్పేవారుండరాదని అతని కోరిక. సదా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గాలిలో తెగిన గాలి పటంలా సంచరించాలన్నదే అతని తత్వం.

అందువల్ల మనిషికి ఈ జీవితానంతరం తన కర్మలన్నింటికీ బదులు చెప్పుకుని, చేసిన దాని ప్రతిఫలం అనుభవించవలసి ఉంటుందంటే అతని హేతువు ఒప్పుకున్నా, అంతర్యం దానికి అనుకూలంగా సాక్ష్యమిచ్చినా అతని కోరికలు, కాంక్షలు దాన్ని తిరస్కరించమంటాయి. కోరికల దాసుడయిన మనిషి ఆ సలహాను స్వీకరించి లేని ధైర్యం ప్రదర్శిస్తాడు. మరో లోకంలో హాజరు కావలసిఉంటుందంటే అవహేళనచేస్తాడు.

మనిషిలోని ఈ అల్పబుద్ధినే ప్రభువు ఎత్తి చూపుతున్నాడుః

*"వాస్తవ మేమంటే మనిషి తన దుర్వర్తనల్ని ఇకపై కూడా కొనసాగించాలని కోరుకుంటున్నాడు. (అందుకే పరిహాసంగా) ఆ ప్రళయ దినం ఎన్నడు వస్తుందండీ, అని సవాలు విసురుతున్నాడు!". (75 : 5,6)*





# ఇంతేలే ఈ లోకం!

ఈ విశ్వ వ్యవస్థ ఎంత రమ్యమయింది. ఎంత క్రమబద్ధమయింది. నియమం తప్పక దర్శనమిచ్చే సూర్యుడు, తన విధి నిర్వహణలో జాప్యం చెయ్యక కట్టుదిట్టంగా వస్తూ పోతూ ఉండే చంద్రుడు, ఈ తారలు, గ్రహాలు, ఉపగ్రహాలు - అంతా ఎంత శోభనిస్తాయి. రోజులూ, నెలలూ గడిచేకొద్దీ మారే రుతువులు, కాలం మారుతుంటే దానితో పాటే మారే ప్రకృతి దృశ్యాలు, ప్రకృతి అందాలు!

అంతేకాదు, ఈ ఒక్క భూమిలోనే ఎన్ని సోయగాలు! ఒక్కోచోట ఒక్కో అలంకరణ, ఒక్కో పంట, ఒక్కో ఫలం!! ఎంత వైవిధ్యం, ఎంతటి భిన్నత్వం !!!

అందాలు జాలువారే ఈ లోకం, ఈ విశ్వ వ్యవస్థలో ఓ చిన్న అపశ్రుతి పలికిందంటే చాలు - అంతా ఛిన్నాభిన్నమయిపోతుంది.

ఒక్క మెరుపు మెరిసినా, ఒక్క ఉప్పెన వచ్చినా, ఒక్క భూప్రకంపనం సంభవించినా మనిషి నివ్వెరపోతాడు, గుడ్లు తేలవేస్తాడు.

అలాంటిది ఈ విశ్వ వ్యవస్థలో ఎక్కడో ఓ చిన్న మార్పు జరిగి సూర్య చంద్రాదులు తమ తేజస్సును, భ్రమణాన్ని వదలి పెడితే ఎంతటి భయానక పరిస్థితులు ప్రత్యక్షమవుతాయి. మొత్తం విశ్వ కార్యకలాపాలే తల్లక్రిందులయిపోతాయి.

మనిషి ఇదంతా చూసి అచేతనుడయిపోతాడు, క్రియాహీనుడయిపోతాడు. అతని మనోమయ స్థితికి దర్పణం పట్టేలా అతని కనుగ్రుడ్లు చలనం మరిచిపోతాయి.

మనిషి తన అంతం సమీపించిందని తాను ఏ విషయాన్నయితే ఎదుర్కోవడానికి ఇష్టపడలేదో అదే తారసపడినట్లు గుర్తిస్తాడు.

అతనికి తాను చేసిన ఒక్కో చర్య, ఒక్కో చేష్ట కళ్ళ తెరముందు దర్శనమివ్వడం మొదలెడుతాయి.

తాను ఏదయితే చెయ్యవలసి ఉండిందో, ఏదయితే చేశాడో, అవన్నీ కళ్ళ ముందు నిలుస్తాయి.

తాను చేసిన ఏ చర్యల ఫలాలనయితే అతని తరువాతి తరాలు కూడా అనుభవించాయో అవన్నీ సాక్ష్యమిస్తాయి.

ఒక్క మాటలో అతనికి, అతని జీవితమంతా, జీవితంలోని సంఘటనలన్నీ ఒక్కొక్కటే ప్రత్యక్షమవుతాయి. ఈ దృశ్యాన్నే ప్రభువు ఇలా చిత్రించాడు:

*"ఆ తరువాత కనుగుడ్లు తేలిపోయినప్పుడు, చంద్రుడు కాంతి విహీనమయిపోయినపుడు, చంద్రుణ్ణి సూర్యుణ్ణి కలిపి ఏకం చేసివేసినప్పుడు ఆ సమయాన ఈ మనిషే అంటాడు - 'ఎక్కడికి పారిపోను??' అని. ఏమాత్రం వీల్లేదు. మరే శరణూ లభించదు. ఆనాడు నీ ప్రభువు సమక్షంలోనే పోయి నిలబడవలసి ఉంటుంది. ఆ రోజున మనిషికి తాను వెనకా ముందూ చేసినదంతా చూపెట్టడం జరుగుతుంది.*

*(75 : 7 - 13)*



# మనిషి జంతువా ?

ఏమిటి మనిషి వైఖరి, తన్ను తాను 'మాట్లాడే జంతువు' అని పిలుచుకుంటాడేమిటి? తనకూ జంతువులకూ ఉన్న అతి ముఖ్యమయిన వ్యత్యాసం అతని కళ్ళకు అగుపడటం లేదా??

మనిషికి ఎన్ని అధికారాలు ! భూమి గుండెల్ని చీల్చి, మైళ్ళ కొద్దీ లోనికి దిగి అందులోని నిక్షిప్తాలన్నీ వెలికి తీసి వినియోగించుకుంటాడు. నింగికేసి ఎగిసి నక్షత్రాలనే త్రుంచి తీసుకువస్తాడు.

ఇష్టమయితే ఎదుటివారి మంచి కోసం తన ప్రాణాలనయినా ధారబోస్తాడు. కాకపోతే సొంత లాభం కోసం ఎదుటి వారి నెందరి ప్రాణాలయినా సునాయాసంగా బలిదీసుకుంటాడు.

ఇన్ని అధికారాలు, ఇంతటి స్వేచ్ఛ గల మనిషికీ, ప్రకృతి సిద్ధమయిన బాటన తప్ప మరే వైపూ కన్నెత్తి కూడా చూడలేని జంతవులకూ సంబంధం ఏమిటి? మనిషి నైతిక జీవి, బాధ్యతాయుత ప్రాణి అన్న ప్రస్ఫుటమయిన సత్యం మనిషి మేధకు అందడం లేదంటే మనిషికి ఓ విధంగా బానిస అయి ఊడిగం చేస్తున్న ప్రకృతి ఆశ్చర్యపోదూ!

మనిషి ఎన్ని ఫిలాసఫీలు కల్పించుకున్నాడు, ఎన్ని మతాలు సృజించుకున్నాడు, ఎన్ని దైవాలు సృష్టించుకున్నాడు, ఎన్ని సంప్రదాయాలు నిలిపాడు, ఎన్ని సభ్యతలు, ఎన్నెన్ని సంస్కృతులు రూపొందించాడు ! ఏ జంతువయినా ఇవన్నీ ఎందుకు చేస్తుంది, ఎలా చెయ్యగలుగుతుంది!?

మనిషి చేసే ఈ మంచీ చెడు కార్యకలాపాల ఫలితాలను అతను ఎన్నడు అనుభవించాలి? దానికి ఈ బతుకు సరిపోతుందా?? కాదు, మరో జీవితం కావాలి! ఇదే బుద్ధి ఇచ్చే తీర్పు !! ప్రభువు ప్రకటించేదీ అదే :

*"మనిషి తనను అలాగే కళ్ళెం లేని గుర్రంలా వదిలెయ్యడం జరుగుతుందని అనుకుంటున్నాడా? అతను ఆదిలో, మాతృగర్భాశయంలో కారే అత్యల్పమయిన ఓ బిందువు రూపంలో ఉండేవాడు కాదా? ఆ తరువాత అతను ఓ కండముక్క అయ్యాడు. ఆ పైన దైవం అతని శరీరాన్ని నిర్మించాడు, అతని అవయవాలను తీర్చిదిద్దాడు, ఆ ప్రాణిని పురుషుడని, స్త్రీ అని రెండు రకాలుగా చేశాడు. అలాంటి ప్రభువుకు మృతి చెందిన వారికి తిరిగి బ్రతుకునిచ్చే శక్తి లేదా?"* (75 : 36-40)

# ఏమీలేని నాడు !

**ఒ**కానొకప్పుడు అంతా శూన్యం ! ఊహా జగత్తులోకి వెళ్ళి వేనవేల సంవత్సరాలు వెనక్కి తిరిగి కన్నులు తెరచి చూస్తే బహుశా కరడుగట్టిన చీకటి తప్ప మరేమీ అగుపించదేమో! ఇలా ఎంతకాలం సాగిందో ఎవరు చెప్పగలరు?! ఆదీ అంతమూ లేని ఈ కాల భ్రమణంలో జీవకణం ఎప్పుడు ఉద్భవించిందో, తరువాత ఏ నాటికి మానవ స్వరూపం ఉనికిలోకి వచ్చిందో ఎలా తెలుస్తుంది?!

తెలిసినా మనిషి చెయ్యగలిగిందేమీ లేదు. నేటికి సహస్రాది సంవత్సరాల క్రితం శూన్యంలో, చీకటిలో ఓ వెలుగురేఖ ప్రసరించి, ఓ జీవకణం ఉద్భవించి, ఈ అనంత సృష్టి తన అందాలను తీర్చి దిద్దుకున్నప్పుడు అత్యంత హీనమయిన స్థాయి నుండి ఇంతలా ఎదిగి అనన్యంగా రూపొందిన మానవ రూపం నేటికీ తన జన్మస్థితిని మార్చుకోలేక పోయింది.

నేడూ మానవుడు 'లేమి'లో నుండే 'ఉనికి'ని పొందుతాడు. అత్యల్ప జీవియే నేటికీ అత్యంత శక్తిమంతమయిన మేధా సంపన్న సృష్టిరాశిగా రూపొందుతూ ఉంది

నిజమే కదా, ఏ మాత్రం చెప్పుకోదగ్గ స్థితిలోలేని ఓ కణం నుంచే మానవ శరీరం ఉనికిలోకి వస్తుంది.

ఎంతో శక్తిగల సూక్ష్మదర్శిని సహాయంతో చూస్తే తప్ప కనిపించని మానవ శరీర కణం రెండు వేర్వేరు భాగాల కలయికతో ఏర్పడిందే.

ఒకటి తండ్రి ద్వారా మరొకటి తల్లిద్వారా లభించిన రెండు వేర్వేరు అంశాలు ఏకమయి ఏర్పడిన అత్యంత సూక్ష్మకణం విను వీధుల పరిధులన్నీ చీల్చుకుని అనంత విశ్వంలోకి చొచ్చుకుపోతాడని, క్రొంగ్రొత్త లోకాలు ఆవిష్కరిస్తాడని ఎవరయినా ఎలా అనుకుంటారు ? అదే ప్రశ్నిస్తున్నాడు విశ్వ ప్రభువు :

*"అనంత కాలంలో ఒకింత కాలం, మానవుడు ఏ మాత్రం చెప్పుకో దగ్గ స్థితిలో లేని దశ అతనిపై ఏదయినా గడిచిందా?"*

*(76 : 1)*



# మహోపద్రవం వచ్చినప్పుడు...

హఠాత్తుగా కనికరం లేని ప్రమాదం కోరల్లో చిక్కుకున్న క్షణంలో - వరదలో, తుఫానో, రైలు ప్రమాదమో, బస్సు ప్రమాదమో జరుగబోతోందన్న యదార్థం తెలిసిన క్షణంలో - మనిషి జీవితమంతా ఊహల్లో అతని కళ్ళముందు సినిమారీలులా సాగిపోతుంది. కనీసం అతని జీవితంలోని ముఖ్య ఘట్టాలయినా ఒక్క టొక్కటే దర్శనమివ్వడం మొదలెడతాయి.

చేసిన అపరాధాలు, అన్యాయాలు, అక్రమాలు, అధర్మాలు, అకృత్యాలు మూర్తీభవించి ప్రత్యక్షమవుతాయి. పర్యవసానం ఏమవుతుందో, ఏమి కాబోతోందో ఊహించడం ఆ క్షణాన మనిషికి అంత కష్టం కాదు. కాని అప్పుడున్న పశ్చాత్తాప భావం మరో క్షణం వరకు కూడా నిలువజాలదు. ప్రమాదం తప్పిందంటే మళ్ళీ మామూలే.

కాని అంతిమ ఘడియ - ప్రపంచానికే అంతిమ ఘడియ ఆసన్నమయినప్పుడు - పశ్చాత్తాపమూ పనికి రాదు, ఆ ప్రమాదమూ తప్పదు, తిరిగి ఏ విధమయిన ఆచరణకు ఆస్కారమూ ప్రాప్తం కాదు.

ఆ అంతిమ ఘడియను ప్రపంచంలోనే ఎంతగా గుర్తు చేసినా ఖాతరు చెయ్యని మనిషి, అర్థం చేసుకోని మనిషి అది నిజంగానే ఆసన్నమయినప్పుడు మటుకు కుమిలి కుమిలి రోదించడం తప్ప మరేమీ చెయ్యలేడు.

తన ప్రభువుకు విధేయుడయి మెలిగిన మనిషి సుఖ సంతోషాలను ఆస్వాదిస్తే, అవిధేయతే తన వైఖరిగా మెలిగిన వ్యక్తి సతతం వేధించే యాతనకు గురి అవుతాడు. అదే చెబుతున్నాడు పరమప్రభువు.

*"తరువాత ఆ మహోపద్రం సంభవించినప్పుడు, ఆనాడు, మనిషి తాను చేసిన చేష్టలన్నీ గుర్తు చేసుకుంటాడు, చూసే ప్రతి మనిషి ఎదుట నరకాన్ని తెరచి పెట్టడం జరుగుతుంది, అప్పుడు ఎవడయితే తల బిరుసుగా వ్యవహరించాడో, ప్రపంచ జీవితానికే ప్రాధాన్యమిచ్చాడో అతని గమ్యం నరకమే అవుతుంది. మరెవరయితే తన ప్రభువు సమక్షంలో నిలబడవలసి వస్తుందని భయపడ్డాడో, మనసును దుష్ట కాంక్షలకు దూరంగా ఉంచాడో స్వర్గమే అతని నివాసమవుతుంది".* *(79 : 34 - 40)*

# బ్రతుకే కాదు, చావూ నీ చేతిలో లేదు !

మనిషి ఎంత కాదన్నా తన పుట్టుక రీత్యాను, తన జీవిక, జీవితం, జీవన మార్గం దృష్ట్యాను తన నిజ ప్రభువు, స్వామికి ఎంతో రుణపడి ఉన్నాడు. తన పుట్టుకనే ఒకసారి గుర్తు చేసుకుంటే మనిషికి తానెంత నిస్సహాయ స్థితిలో ఉనికిలోకి వచ్చాడో, ఎంతటి బలహీనమయిన రీతిలో అతని రూపకల్పన జరిగిందో, ఏ మార్గాల ద్వారా వచ్చి తాను ఈ లోకాన కాలిడే అర్హతను పొందాడో, ఇలా ఏ విధంగా అతని జీవితం ప్రారంభమయిందో తెలుస్తుంది.

అతను ఇంకా తల్లి గర్భంలోనే కళ్ళు కూడా కానని, చెవులూ వినరాని అవస్థలో ఉండగానే అతని భాగ్యరేఖ నిర్ణయమయింది. పురుషుడో, స్త్రీయో, పొట్టివాడో, పొడుగరో ఏ గుణాలు, ఏ లక్షణాలు, ఏ రంగు, ఏ రూపురేఖల వాడు కావలసి ఉందో జన్మ్య అవస్థలోనే నిర్ణయమయిపోయింది.

అవయవ సౌష్టవం ఏ రీతిలో ఉంటుందో, విభిన్న ఇంద్రియ శక్తులు ఏ స్థాయిలో, ఏ మేరకు ప్రాప్తం కావాలో, శక్తి సామర్థ్యాలు ఎలా ఉంటాయో, బుద్ధీ వివేకాలు ఎలా ఉంటాయో, అతని వ్యక్తిత్వపు నిర్మాణంలో వారసత్వపు ప్రభావాలు ఏ మేరకు ఉంటాయో, అతని స్వంత కృషి ఫలితాలు ఏ స్థాయికి అతన్ని ఎదగనిస్తాయో అంతా ఆనాడే నిర్ణయమైపోయింది.

అదే భాగ్యరేఖ !

ఈ భాగ్యరేఖను మనిషి తలక్రిందులు వేలాడినా మార్చలేడే? అలాంటి నిస్సహాయ జీవి ఈ మానవుడు తన ప్రభువు పట్ల కృతఘ్నత కనబరుస్తున్నాడు?!

ఎంత స్వామిద్రోహానికి, తిరుగుబాటుకు పాల్పడుతున్నాడు !!!

మనిషి బ్రతుక్కే కాదు అతని మరణం కూడా అతని చేతుల్లో లేదు. తన ఇష్టాయిష్టాల ప్రమేయం లేకుండా ఎలా పుట్టాడో అలాగే ఇష్టాయిష్టాల ప్రమేయం లేకుండా మరణమూ తథ్యమే.

ఆ తరువాత తిరిగి ఆ స్వామి బ్రతికిస్తే బ్రతకడమూ అనివార్యమే! తన పునరుజ్జీవనం సాధ్యం కాదని అతను దేని ఆధారంగా భావిస్తున్నాడు ??

ప్రభువు చెప్పేదీ అదే :

*'మనిషి ఎంత ఘోరమయిన సత్యతిరస్కారి! ప్రభువు అతన్ని ఏ పదార్థంతో సృజించాడు? ఒక్క ఇంద్రియ బిందువుతో ! ప్రభువు అతన్ని సృజించాడు. అతని భవితవ్యాన్ని నిర్ణయించాడు. అతని జీవన మార్గాన్ని సుగమం చేశాడు. ఆ తరువాత మృత్యువునిచ్చాడు. గోరీలోకి చేరవేశాడు!! తిరిగి తానెప్పుడు కోరితే అప్పుడే అతన్ని మళ్ళీ బ్రతికించి లేపి నిలబెడతాడు. అసలు విషయం అది కాదు, అతను తన ప్రభువు ఆదేశించిన విధిని నిర్వర్తించడం లేదు."* *( 80 : 17 - 22)*



# ఇదంతా ఎవరి కృప ?

ప్రభాకరుని కిరణాలు ఎల్లెడలా ప్రసరించినట్లు సముద్రతలాన్నీ పరామర్శిస్తాయి. సముద్రపు కెరటాలు, ఎంతో సహృదయంతో, మరెంతో మక్కువతో పలకరించి, ఆతిధ్యమిచ్చి వచ్చిన ఆ అతిథులకు తమ ఆంతర్యమే విప్పి చెబుతాయి. తమలో కొంత భాగాన్ని అతిథి సత్కారంగా ఆ కిరణాలకు ఇచ్చి సాగనంపుతాయి.

అదే – ఆ నీటినే ఆవిరిగా మార్చి సూర్య కిరణాలు గగన తలాన చేర్చుతాయి. వాటిని పెంచి పోషిస్తాయి. మేఘాలుగా రూపుదిద్దుతాయి.

ఆ మేఘాలు రెక్కలు తొడిగిన పక్షుల్లా స్వేచ్ఛగా తిరుగుతూ గగనతలమంతా స్వైరవిహారం చేస్తాయి.

చివరికి తమకు సహజంగా అబ్బిన కరుణార్ద్ర స్వభావంతో ఎండిన నేల దాహాన్ని తీర్చడానికి క్రిందికి దిగి వస్తాయి !

అలా వర్షించిన నీరు నేలనంతా తడిపివేస్తుంది. బావులూ, చెరువులూ నింపివేస్తుంది.

నదుల్లో ప్రవహిస్తుంది.

కొండలపై మంచయి నిలుస్తుంది. తిరిగి సూర్యకర సంతప్త ప్రధానాంగులయిన పర్వతాల నుండి ద్రవించి, స్రవించి, భూమి దాహార్తిని సంతృప్తి పరుస్తుంది !!

ఒక్క నీటిని చూస్తేనే, ఏమిటి ఈ ఏర్పాట్లు అని విస్తుపోదూ మనస్సు? అయితే ఆలోచించే మనస్సు కావాలి !

ఇక ఆహారాన్ని చూద్దామంటే – మనిషి ఆహారంలో అధికంగా వుండే ధాన్యాలూ పప్పు దినుసులు పళ్ళు, కూరగాయలూ అన్నీ వృక్ష సంపద నుండి వచ్చేవే.

మనిషి మహా గొప్పగా చేసేది ఏమిటీ? నేలను త్రవ్వడమో, దున్నడమో చేసి అందులో విత్తనం నాటడం – ఆ తరువాత అంతా – మొలకెత్తడం మొదలుకుని పండడం వరకు జరిగే తంతు జరిపే దెవరు? ఆలోచించే హృదయం కావాలి !!



మనుషులకే కాదు మనుషులకు ఆహారం గాను, వాహనం గాను, వ్యావసాయిక, ఆర్థిక రంగాల్లో సహాయంగాను ఉపకరించే పశువులకు కూడా ఆహారాన్ని ఎవరు సరఫరా చేస్తున్నారు?

నీటినీ, ధాన్యాన్ని, పండ్లూ ఫలాలను ఎవరు అందిస్తున్నారు? ఎవరు పండిస్తున్నారు??

"ఇంకా, మనిషి తన ఆహారాన్ని కాస్త పరిశీలించాలి. మేము నీటిని పుష్కలంగా ప్రవహింపజేశాము; ఆ పైన నేలను చిత్రంగా చీల్చాము; తరువాత అందులో పండించాము - ధాన్యాలు, ద్రాక్షపళ్ళు, కూరగాయలు, జైతూన్, ఖర్జూరం, దట్టమైన తోటలు, రకరకాల పండ్లు, మేత - మీ కొరకూ, మీ పశువుల కొరకూ జీవన సామగ్రిగా."

*( 80 : 24 - 32)*



# మనుగడ ప్రణాళికాబద్ధం !

మానవ జీవితం ఎంత విచిత్రమయింది ! పుట్టుకే ఓ వింత అనుకుంటే బ్రతుకంతా చిత్రవిచిత్రాలమయం. అడుగడుగునా అనూహ్యమయిన పరిణామాలు, ప్రతి రోజూ అయోచితమయిన మలుపులు.



మనిషి నిన్న వ్యాధుల బారి నుండి తప్పించుకు బయటపడ్డాడంటే నేడు దుర్ఘటనలు, వైపరీత్యాలూ అతన్ని వెంటాడుతుంటాయి.

ఒక ప్రమాదాన్ని దాటగలిగాడంటే మరెన్నో విపత్తులు నోరు తెరుచుకుని కాచుక్కూర్చుంటాయి.

శారీరక బాధలనుండి విముక్తి పొందానని సంతసిస్తే మానసిక శాంతికే ముప్పు ముంచుకువస్తుంది.

ఇంటి బాధల్ని ఎలాగో అధిగమించగలిగాడంటే ఆత్మక్షోభకు గురి చేసే మరో తిమింగలం లాంటి సమాచారం వచ్చి చుట్టేసుకుంటుంది.

శత్రువుల శాపనార్థాల తుఫానుకు తట్టుకోగలిగితే బంధువుల నిందల జడివాన పట్టుకుంటుంది.

అయినా మనిషి వీటన్నింటినీ దాటగలుగుతున్నాడు. వీటన్నింటిపై స్వారీ చెయ్యగలుగుతున్నాడు. వీటన్నింటిలోనుండి ఆరితేరి రాగలుగుతున్నాడు.

ఇన్ని ఒడిదుడుకులున్నా, ఇన్ని అడ్డంకులున్నా, ఇన్ని సమస్యలున్నా మనిషి మనుగడలో ఎన్ని సుఖాలు, ఎన్ని సౌకర్యాలు, ఎన్ని సాధనాలు, ఎన్నెన్ని అవకాశాలు !



ఇదంతా ఎలా సమకూరుతోంది? ఎలా సాధ్యమవుతోంది? మనిషేమన్నా స్వయంగా చేసుకోగల శక్తిమంతుడా?

కాదే! అతని పుట్టుకే ఎంతో ప్రణాళికాబద్ధంగా జరుగుతుంది. అలాంటప్పుడు మనిషి మనుగడ వెనుక పథకం ఏదీ ఉండదా? ఉందంటున్నాడు ప్రభువు :

*"మనిషి తాను ఏ పదార్థంతో సృజించబడ్డాడో కాస్త చూసుకోవాలి. ఎగిసిపడే ద్రవంతో అతన్ని సృజించడం జరిగింది. అది వెన్ను, పక్కటెముకల మధ్య నున్న కేంద్రంనుంచి వెలువడుతుంది. నిస్సందేహంగా ఆ సృష్టికర్త ఇతన్ని తిరిగి సృజించగల సామర్థ్యం గలవాడు. ఏ రోజయితే మరుగున పడ్డ రహస్యాల విచారణ జరుగుతుందో ఆ రోజున మనిషి వద్ద ఏ శక్తి ఉండదు, అతనికి సహాయపడే వాడూ మరొకడు ఉండడు."* (86 : 5 - 10)



# తోటి మనిషిని ఆదరించు !

మనిషి - లేమికి గురయిన వారంటే, అనాధలంటే, నిరుపేదలంటే దరిద్రులంటే అగత్యపరులంటే, ఉపేక్షిత జనమంటే - చీదరించుకుంటాడు.

ఆదరించడం, గౌరవించడం అలా ఉంచి వారి అవసరాన్ని తీర్చడానికయినా, కనీసం అన్నార్తులకు అన్నం పెట్టడానికయినా ముందుకు రాడు, మరెవ్వరినీ ముందుకు రానివ్వడు.

దొరికిన మట్టుకు అంతా కాజెయ్యడానికే సిద్ధమవుతాడు కాని కనీసం హక్కు గలవాళ్ళ హక్కుల్ని అందజెయ్యడానికయినా ఇష్టపడడు.

ధనం అతని ఊపిరి, సంపద అతని లక్ష్యం, దోపిడి అతని మార్గం, విలాసమయ జీవితం అతని గమ్యం -

కాని - భోగవిలాసాలు శాశ్వతంగా అతన్ని వరిస్తాయా? ఎన్నటికీ కాదు! ఈ జీవితం అంతమయి మరో లోకం, మరో జీవితం ప్రారంభమయినప్పుడు అతనికి తెలిసి వస్తుంది - అతడు ఎంత పెద్ద పొరపాటు చేశాడో !

జీవితమంటే ఇహలోక జీవితమే అనుకున్నాడు. సుఖం అంటే ఇక్కడ దొరికేదే అని తలపోశాడు.

కాని మనిషికి ఇంత గొప్ప విశ్వాన్ని, ఇక్కడి సమస్త భోగ భాగ్యాలను, ఇన్ని నిధి నిక్షేపాలను, శక్తుల్నీ, సంపదల్ని, వీటిపై మనిషికి అదుపును, అధికారాన్ని, తనకు ఇష్టమయిన రీతిలో వినియోగించుకునే స్వేచ్ఛను ప్రసాదించిన స్వామి ఇట్టే వదిలేస్తాడా? అడగనయినా అడగడా??

ఆలోచించలేదు మనిషి, కాని ఆ తరువాత - వ్యవధి ముగిసిన తరువాత - చింతించి ప్రయోజనం ఉండదు ఆ మాటే విశ్వ ప్రభువు తన సందేశంలో వినిపిస్తున్నాడు.

*"ఏ మాత్రం కాదు, భూమిని దంచి దంచి పిండి పిండి చేసివేసినప్పుడు మీ ప్రభువు దివ్యంగా సాక్షాత్కరిస్తాడు. ఆయన వెంట దైవ దూతలు బారులు తీరి పంక్తులు పంక్తులుగా నిల్చుంటారు. నరకాన్ని ఆ రోజున ముందుకు*

తేవడం జరుగుతుంది. ఆ రోజున మనిషి గుర్తిస్తాడు - అయితే ఆ సమయాన గుర్తించి ప్రయోజన మేమిటి ? అప్పుడు అతను, 'నేను నా ఈ జీవితం కొరకు ముందుగా ఏమయినా చేసి ఉంటే ఎంత బాగుండేది?!' అని వాపోతాడు. కాని ఆనాడు దైవం గురిచేసే యాతనలాంటి యాతనకు గురిచేయగల వాడు మరెవడూ లేడు. అలాగే దైవం కట్టివడేసే విధంగా కట్టగల వాడున్నూ మరెవడూ లేడు" (89 : 21 - 26)



# శ్రమలేనిది ఏదీ లేదు !

భువిలో మానవ జీవితం వర్ధించిన విస్తరిలా ఎన్నడూ అలరారలేదు.

ధాత్రిపై అడుగిడిన ప్రతి మనిషి ఏదో ఒక రూపంలో నిరంతర పరిశ్రమతో, కష్టాలను కడగండ్లను, అవరోధాలను అవాంతరాలను దాటుకుంటూనే పోతున్నాడు.

విపత్తులను, ప్రమాదాలను ఎదుర్కొనకుండా ముందుకు సాగడం కాని పని.

మనిషి తల్లి గర్భంలో పిండంగా రూపుదాల్చిన క్షణం మొదలుకుని అంతిమ శ్వాస వదిలే వరకు అడుగడుగునా కష్టాలు బాధలు తప్పితే ఏమున్నాయి?

ఏ క్షణాన గర్భస్రావం జరుగుతుందో అన్న భయం వెంటాడింది. ఆ దశ దాటి నేలపై పడ్డ క్షణంలోనూ ఏది ఎలా జరుగుతుందో అన్న ఆందోళనలు చుట్టుముట్టాయి.

పుట్టిన తరువాత పెరిగే వరకూ అనునిత్యం ప్రమాదభూయిష్టమయిన జీవితమే గడిచింది. దిన దిన గండం నూరేళ్ళ ఆయుష్షు అన్న సూక్తి దీన్నేకదా సూచిస్తూ ఉంది ! ఇదీ మనిషి బ్రతుకు బాట !!

సామాన్య మానవుణ్ణి అలా ఉంచి, మనిషి ఎవరివైపునకయితే ఆశతో, ఈర్ష్యతో అసూయలతో చూస్తూ తనకు అలాంటి జీవితం ఉంటే ఎంత బావుండు అని కోరుకుంటాడో అలాంటి వారంతా నిరంతర కృషి, శ్రమ లేకుండానే అదంతా సాధించలేరు. తాము సాధించిన దాన్ని వారు కాపాడుకోగలగాలన్నా అనవరతం జాగ్రదావస్థలో ఉంటూ ఎంతో జాగరూకతతో మెలిగితే తప్ప సాధ్యపడదు.



ఏ రాజయినా, మరే పరిపాలకుడయినా, ఏ విశ్వవిజేత అయినా ఎన్నడు ఏ కుట్ర జరిగి సింహాసనం తన క్రింది నుండి జారిపోతుందో అన్న నిత్య శంకకు లోనయి జీవించడం తప్ప గత్యంతరం లేదు.

రాజులు, రారాజుల కాలం అటుంచి మిలటరీ సైనిక నియంతలు నిరంకుశ పార్టీ నేతల ఈ కాలంలోనూ, ప్రజాస్వామిక యుగం అని చెప్పుకునే ఈ రోజుల్లోనూ మనం చూస్తూనే ఉన్నాము ఎలా అధికారాలు అనూహ్యమయిన రీతిలో చేతులు మారుతున్నాయో!

అలాగే ఏ ధనవంతుడయినా, సకల భోగ భాగ్యాల్లో తులతూగే ఏ కుబేరుడయినా ఒక వంకన తన సిరులు ఎలా తరిగిపోతాయో అన్న భయానికి లోనయి ప్రతి అడుగూ నేల ఊదుకుంటూ వేస్తుంటే మరో వంక ఉన్న సంపాదనను ఎలా రక్షించుకోవాలి, ఎలా పెంచుకోవాలి అన్న పేరాశల పథకాల రూపకల్పనల్లో తలమునకలయి ఉంటున్నాడు.

ఒక్క వ్యక్తీ కూడా సుఖంగా ప్రశాంతంగా ఊపిరి పీల్చుకోలేక పోతున్నాడు. ప్రభువు అదే పలుకుతున్నాడు.

"వాస్తవమేమంటే మేము మనిషిని కష్టాల్లో సృష్టించాము. తనపై ఎవరూ ఆధీనం సాధించలేరని మనిషి అనుకుంటున్నాడా? 'నేను రాసులకొద్దీ ధనాన్ని వెచ్చించాను' అని అతనంటున్నాడు (తాను ఎలా సంపాదించాడో ఎలా ఖర్చు పెడుతున్నాడో) తనను ఎవరూ చూడలేదని అతను భావిస్తున్నాడా?" ( 90 : 4 - 7)



# ఉత్తమ సృష్టి !

ఎంత శ్రేష్ఠమయినది మానవుని పుట్టుక !

ప్రపంచంలోని జీవరాసుల్లోకెల్లా ఉత్తమమయిన శరీర నిర్మాణం, సకల సృష్టిరాశినే అధీనంలో ఉంచుకోగల మేధాశక్తి, ఏ పనినయినా సులభంగా సునాయాసంగా చేసుకోగల సామర్థ్యం, కొంగ్రొత్త ఆలోచనలతో, ఆవిష్కారాలతో, తన జీవితాన్ని సుఖవంతం, శాంతిమంతం చేసుకునే నైపుణ్యం, ఇవన్నీ మనిషికి ఎలా అబ్బాయి?

ఎంతో అద్భుతమైన తన మస్తిష్కంలాంటి మరో కృత్రిమ మస్తిష్కాన్ని (కంప్యూటర్ని) తయారు చెయ్యగల మనిషి వైజ్ఞానిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఏమని కొనియాడగలం? ఎంతని పొగడగలం?!

అనన్య సామాన్యం మనిషి స్వరూపం, స్వభావాలు !!

అయితే ఈ గొప్పతనం ఎంతో సేపు నిలువదు - ఒకవేళ మనిషి తన శారీరక బలాన్ని, మనోమస్తిష్కాల శక్తుల్ని, మేధాసంపన్నతను మానవాళికి చెడుగును చేకూర్చే మార్గాలలో వినియోగిస్తే !



మనిషి శక్తి సామర్థ్యాలు, దీక్షాదక్షతలు నైతిక నియమాలకు లోబడి వ్యవహరించినంత కాలం అతనికీ తోటి మానవునికీ మేలు కలిగించేదిగా అలరారుతాయి.

కాని నైతిక ప్రమాణాలను మనిషి కాదన్నాడంటే తాను ప్రకృతిలో పొందిన అత్యున్నత స్థానం నుండి, పైపై ఎత్తుల నుండి అతను క్రిందికి, లోతుల్లోకి దిగజారిపోవడం మొదలవుతుంది.

ఆ లోతులు - అత్యాశ, పేరాశ, స్వార్థం, కాంక్షల దాస్యం, రుచుల ఊడిగం, అహంభావం, దురహంకారం, విద్వేషం, క్రోధం, ఆగ్రహం లాంటి నీచ గుణాల లోయల్లో అతన్ని పడవేస్తాయి. అతడు తన విజ్ఞాన సంపదతో పాటు అడవి మృగాలకన్నా హీనమయిన మురికి కూపంలో తేలియాడుతూ ఉంటాడు. అదే అంటున్నాడు ప్రభువు :

*"మేము మనిషిని అత్యుత్తమ రూపకల్పనతో సృజించాము. ఆ తరువాత అతన్ని(అతని చేష్టల కారణంగా) మరల్చి నీచాతి నీచ స్థాయికి దిగజార్చు తాము - విశ్వసించి, సదాచరణ చేసే వారిని తప్ప. సదాచరణ చేసేవారికి ఎన్నటికీ అంతం కాని ప్రతిఫలం ప్రాప్తమవుతుంది."* *(95 : 4-6)*

# బోధన అవతరించింది !

అంధకారమయమయిన ఓ గుహ.★ గుహలో ఒంటరిగా ఓ వ్యక్తి.

ఆ వ్యక్తి సుదీర్ఘ ధ్యానంలో నిమగ్నుడయి ఉన్నాడు.

ప్రపంచం, ప్రపంచంలో మానవుడు, మానవుని స్థానం, బాధ్యతలు, కర్తవ్యాలు ఏమయి ఉంటాయని, ఏమయి ఉండాలని ఆలోచిస్తున్నాడు ఆ వ్యక్తి.

ఏమిటి ఈ సుఖ దుఃఖాల సంబంధం ? ఏమిటి ఈ జనన మరణాల పరంపర? ఏమిటి ఈ మంచీ చెడుల ఘర్షణ ? తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఎంతగా ఆలోచిస్తే అంతగా చిక్కులు ఎదురవుతున్నాయి. సమస్యలు ఎంతకీ ఓ కొలిక్కి రావడం లేదు.

అంతలోనే ఓ వెలుగు – ఓ విజ్ఞాన కిరణం వెలసింది.

అత్యంత పరిశుద్ధమయిన, పవిత్రమయిన రూపం, ఎంతో తెల్లని ఆకారం ఆ వ్యక్తి ముందు నిలిచింది.

ఆ ఆకారం చేతుల్లో బహుశా ఏమ్మో వ్రాసిన ఫలకం ఉన్నట్లుంది.

'చదువు' ! గంభీరంగా, కానీ మృదువుగా, వినయపూర్వకంగా ఉంది ఆ కంఠం.

ఆ వ్యక్తి తెల్లబోయాడు. 'నాకు చదువను రాదే' భయం, భయంగానే అన్నాడు ఆ వ్యక్తి.

ఆ శ్వేత, గంభీర ఆకారం ఆ వ్యక్తిని గట్టిగా తన గుండెకు అదుముకుంది, చదువు' తిరిగి పలికిందా ఆకారం.

నా కసలు చదువనురాదు' బదులిచ్చాడా వ్యక్తి.

మళ్ళీ అదిమిందా ఆకారం–ఇలా మరోసారి కూడా జరిగింది. చివరికి

"చదువు, సృష్టించిన నీ ప్రభువు పేరుతో. ఆయన మనిషిని రక్తపు ముద్దతో సృష్టించాడు . చదువు, నీ ప్రభువు ఎంతో ఉదార గుణం గలవాడు. ఆయన కలం ద్వారా విద్య నేర్పాడు. మనిషికి అతనెరుగని జ్ఞాన మిచ్చాడు".

*(96 : 1 - 5)*

---

★ ఆ గుహ నూర్ పర్వతంలోని హిరా గుహ. ఆ వ్యక్తి ముహమ్మద్ ! ఆ ఆకారం దైవదూత జిబ్రీల్ !!

# మిడిసిపాటు పనికి రాదు !

మనిషి ధనధాన్యాలు, ఐశ్వర్యాలూ కావాలని కోరుకుంటాడు. కీర్తి ప్రతిష్టలూ అభిలషిస్తాడు.

ప్రజల్లో గౌరవ మర్యాదలూ అతనికి ప్రాప్తమవుతాయి. అతను కోరుకున్న భోగభాగ్యాలు లభ్యమవుతాయి. అప్పుడు అతని వైఖరి ఎలా ఉండాలి? వీటి నన్నింటినీ ప్రసాదించిన తన ప్రభువు పట్ల కృతజ్ఞతా భావంతో అతని ఆంతర్యం నిండిపోవాలి.

అతని ఆచరణలన్నింటిలో ఆ కృతజ్ఞత ప్రతిఫలించాలి.

కాని నేడు తనను ఏ అవసరమూ పీడించడం లేదన్న కారణంగా అతను విర్రవీగుతాడా? తలబిరుసుగా వ్యవహరిస్తాడా? హద్దులన్నింటినీ ఉల్లంఘిస్తాడా?

అతని ఈ తిరుగుబాటు ధోరణి ఏమిటి? అతను మరచిపోతున్నాడా, ఈ తనువు చాలించి ఆ ప్రభువు సన్నిధిన చేరవలసి ఉందని?

అతను ఎన్ని సంపదలు సాధించినా, ఎన్ని విలాసాలు అనుభవిస్తున్నా, ప్రపంచంలో ఎన్నెన్ని మెట్లు ఎక్కి, ఎన్నెన్ని మజిలీలు దాటినా చివరికి చేరవలసింది అక్కడికే కదా?

అక్కడ తన ఈ ప్రాపంచిక వైఖరికి పర్యవసానం ఏ రూపంలో ఎదురవుతుందో అతనికి తెలీదా? అక్కడ అతను తప్పక తెలుసుకుంటాడు.

ఇవన్నీ తెలిసినప్పటికీ దైవ విధేయులయిన వారిని, భయ భక్తులతో మెలిగే వారిని, దైవారాధకుల్ని అడుగడుగునా అడ్డగించే వారు, వారి మార్గంలో అవరోధాలు సృష్టించే వారు తెలుసుకోవాలి; అన్నింటికీ స్వామి, ప్రభువు అయిన దైవం. అంతా చూస్తున్నాడు. సత్యసంధుని సదాచరణను, దుర్మార్గుని దౌర్జన్యాన్నీ పరిశీలిస్తున్నాడు ఆ ప్రభువు. ఆయనకు ఏదీ కనుమరుగయి లేదు. అలాంటప్పుడు దుర్మార్గునికి శిక్ష లభించడం, సన్మార్గగామికి బహుమానం లభించడం తప్పనిసరి. అలా జరగకపోతేనే ఆశ్చర్యం, అన్యాయం.

ప్రభువు తన బోధనలో అంటున్నాడు :

"కాదు, కాదు, ఇలా ఎన్నటికీ జరగరాదు. (తను అన్ని భోగభాగ్యాల్లో తులతూగుతూ ఉండటం చూసుకుని మనిషి మురిసిపోతున్నాడు, మిడిసిపాటుకు గురవుతున్నాడు) మనిషి తాను నిరపేక్షాపరుడని భావించి తలబిరుసుతనంతో వ్యవహరిస్తున్నాడు. ఒక వ్యక్తి దైవారాధన చేస్తున్నప్పుడు అతన్ని వారించే మనిషిని నీవు చూశావా? ఆ వ్యక్తి సన్మార్గాన ఉండగా, భయ భక్తుల్ని ఇతరులకు బోధిస్తూ ఉండగా ఈ మనిషేమో సత్యాన్ని తిరస్క రిస్తున్నాడు. సత్యం పట్ల వైముఖ్యం చూపుతున్నాడు. అతనికి తెలీదా, ప్రభువు అంతా చూస్తున్నాడని?"

(96:6-14)



# చేస్తున్నదంతా నమోదవుతోంది !

ఢిల్లీలో ఒకరోజు ఓ టాక్సీవాలా చాలా దూరం తిరిగాడేమో బాగా అలసిపొయ్యాడు. కనీసం ఓ సిగరెట్టు ముట్టిస్తే బావుంటుందని ఆలోచించాడు. దగ్గరలో ఓ బడ్డీకొట్టు అగుపించింది. టాక్సీని దానికి దగ్గరగా ఆపుతూ అటు చూశాడు. అక్కడ 'నో పార్కింగ్' బోర్డు కానవచ్చింది, 'ఇప్పుడెవడు చూస్తున్నాడు. పైగా రోడ్డుపైన అంతగా ట్రాఫిక్కు లేదు. కాస్సేపటిలో రాలేనా' అనుకున్నాడు. నో పార్కింగ్ ఏరియాలో టాక్సీని ఆపాడు.

తాపీగా ఈల వేసుకుంటూ బడ్డీ కొట్టు వద్దకు పొయ్యాడు. పాన్ తీసుకున్నాడు. సిగరెట్టు ముట్టించాడు. రెండు దమ్ములు లాగాడు. హుషారుగా టాక్సీలో వచ్చి కూర్చున్నాడు. స్టార్ట్ చేసి నో పార్కింగ్ స్థలందాటి దగ్గరలోని కూడలి వద్దకు వచ్చాడు. అంతే. ట్రాఫిక్ కానిస్టేబుల్ వచ్చి పట్టుకున్నాడు. కారణం అడిగితే - 'నువ్వు నిషిద్ధ స్థలంలో కారాపావు' అని అన్నాడతను.

'అబద్ధం, నేనలా చెయ్యలేద'న్నాడు డ్రైవరు. 'సరే అదంతా దగ్గరలోని పోలీస్ కంట్రోల్ రూమ్‌లో తేల్చుకుందామ'ని చెప్పి అతన్ని అక్కడికి తీసుకు వెళ్ళాడు. అక్కడ కూడా డ్రైవరు బుకాయించాడు. నేనసలు అటు పోలేదని అన్నాడు. ఓ చిరు నవ్వు విసిరాడు ఇన్స్‌పెక్టర్.

డ్రైవరుని తీసుకుని పక్క రూములోకి వెళ్ళాడు, అక్కడ ఓ ఉచితాసనంపైన కూర్చోబెట్టి అతని ముందున్న టి.వీ.ని ఆన్ చేశాడు. అక్కడి దృశ్యం :



ఢిల్లీలోని పార్కింగ్ నిషిద్ధ స్థలం. బడ్డీకొట్టు. అప్పుడే ఓ టాక్సీ వచ్చి ఆ నిషిద్ధ స్థలం వద్ద ఆగింది. డ్రైవరు ఈల వేసుకుంటూ తాపీగా బడ్డీకొట్టు వద్దకు వెళ్ళాడు....

ఇదంతా చూసి డ్రైవరు తెల్లబొయ్యాడు. అతను కలలో కూడా తలపోయలేదు ఇలాంటి పరిస్థితి ఎదురవుతుందని.

మనిషి సాంకేతిక పరిజ్ఞానమే ఇది సాధించగలిగితే మనిషి మేధను, సర్వ సృష్టినీ

రూపకల్పనచేసి ఉనికిలోకి తెచ్చిన పరమ ప్రభువుకు ఇది అసాధ్యమా? - దివ్య గ్రంథం ఎలుగెత్తి చాటుతోంది :

"భూమి అత్యంత తీవ్రంగా కుదిపి వెయ్యబడినప్పుడు, భూమి తనలోని బరువులన్నీ వెలికితీసి పడవేసినప్పుడు, మనిషి (విస్మితుడయి) భూమికి ఏమయింది? అనంటాడు. ఆ రోజున భూమి (తనపై జరిగిన) వృత్తాంతాలన్నీ వివరిస్తుంది"

(99 : 1-4)



# నష్టపొయ్యేవారెవరు ?

ఒక్కసారి మీ గడియారం వైపునకు దృష్టి సారించండి. సెకనుముల్లు ఎంత వేగంగా ముందుకు పురోగమిస్తుందో చూడండి. కాల గమనాన్ని అది ప్రస్ఫుటంగా ప్రదర్శిస్తుంది మీ ముందు.

ఒక్క సెకను కూడా ఎంతో గొప్పది. ఆ ఒక్క సెకనులో వెలుగు ఒక లక్షా ఎనభై ఆరు వేల మైళ్ళు పయనిస్తుంది.

సృష్టిలో ఇంకా ఏమేమి ఉన్నాయో, అంతకన్నా వేగంగా పయనించేవి?

ఒక్కొక్క సెకను ముందుకు కదులుతూ మన జీవితంలో ఒక్కొక్క క్షణం ముగుస్తోందని చాటుతోంది. కాల గమనాన్ని ఆపడం ఎవరివల్లా కానిది. మనిషి దేన్నయినా చెయ్యగలడు. చేసిన దాన్ని నిర్మూలించగలడు. కాని, కాల భ్రమణాన్ని ఆపలేడు. ఆ భ్రమణం ఓ పయనం. జీవితమూ ఓ నిరంతర పయనం అన్నది 'జీవితం' లాంటి తిరుగులేని యదార్థం.

మనిషికి లభించిన అన్ని సిరులకన్నా 'కాలసిరి' మహా గొప్పది. ఏది తరిగిపోయినా సంపాయించుకోవచ్చునేమో కాని కాలసంపద పోతే - అంతే, అది తిరిగి లభించదు.

ఈ సత్యాన్ని తెలుసుకున్నవాడు తన జీవితాన్ని - అంటే తన కాలాన్ని, తన సర్వస్వాన్ని - సద్వినియోగం చేసుకున్న వాడు - వాడే నిజంగా జీవిత పరమార్థాన్ని పొందగలిగేవాడు. దాన్ని విస్మరించి జీవితాన్ని వృధాగా గడిపేవాడు నష్టపొయ్యేవాడనడంలో సందేహమేముంది ?



'సద్వినియోగం ' అంటే ఏమిటి ? - విశ్వాన్ని, విశ్వంలో తన స్థానాన్ని, 'పరమ' సత్యాన్ని "అర్థం" చేసుకోవడం, దాన్ని నమ్మడం, ఆ 'సత్యం' ఏ విధంగా శాసిస్తే ఆ విధంగా మసలుకోవడం, అందరికీ ఆ సత్యాన్ని అవగతమయ్యేలా బోధపరచడం, దాని కనుగుణంగా నడుచుకునేందుకు ప్రేరేపించడం !! అదే అంటోంది విశ్వ ప్రభువు వాణి :

*"కాలం సాక్షి! యదార్థంగా మానవుడు మహా నష్టంలో పడిపొయ్యాడు - అయితే విశ్వసించినవారు, సతతం సదాచరణ చేసేవారు, ఒకరికొకరు సత్యాన్ని బోధించుకుంటూ, సహనాన్ని ఉపదేశించుకునే వారు మాత్రం (నష్టానికి గురయ్యేవారు) కాదు ."* *(102 : 1 - 3 )*

# తర తమ భేదాలా ?

వృద్ధీ వికాసాల అంబరాలను చుంబిస్తున్న అమెరికా అయినా, నవ నాగరికతా నగారాలను మోగిస్తున్న యూరపు తలమానికం ఇంగ్లండు వారయినా, వారి కనుసన్నలలో మెలిగే దక్షిణాఫ్రికా ఏలికలయినా మనుషుల్ని నల్లవారనీ తెల్లవారనీ విభజించి, ఎల్లలు నాటి, అత్యంత వైజ్ఞానికం అనబడే నేటి యుగంలోనూ మానవతను కించపరుస్తున్నారు.

ఆర్య పుత్రుడు హిట్లర్ లాంటివాడు పుట్టుక రీత్యానే మనిషి ఉత్తముడనీ, అధముడనీ 'గొప్ప' సిద్ధాంతాన్ని సృష్టించి మొత్తం ప్రపంచాన్నే గడగడ లాడించాడు. దాని విషవాయువుల తాకిడికి పతనమయిన ప్రపంచ మానవాళి నేటికీ తేరుకోలేక పోయింది.

మన పుణ్యావనిలోనూ అలాంటి విష జ్వాలలు మనుషుల్ని ఒకటి రెండు కాదు, అయిదేసి వర్ణాల్లో విభజించాయి. కనీస మానవతా మర్యాదలకు సయితం నోచుకోని విధంగా కొన్ని వర్గాల ప్రజలను అణగద్రొక్కడం సహస్రాబ్దాలుగా ఇక్కడ జరుగుతూ వస్తోంది.

వంశం, వర్ణం, వర్గం, దేశం, జాతి, ఇత్యాది – గాలి కూడా చొరబడని – గదుల్లో మానవతని బంధించింది, ఎవరో కాదు ఈ మానవుడే !

అలా బంధించి ఒకరిపై నొకరు అన్యాయం, అక్రమం జరుపుకుంటూ ఉన్నవారు కూడా మానవులే !

ఈ గాలి, నీరు, ఆహార పదార్థాలు అందరికీ సమానమయినవే. మానవుల నరాలలో ప్రవహించే రక్తం మొదలుకుని ఆంతర్యంలో తలెత్తే తలంపుల వరకు అన్నీ ఒకే విధమయిన ప్రకృతి ధర్మానికి లోబడి పుడతాయి మనిషిలో మరలాంటప్పుడు ఈ నిమ్నోన్నతా భేదభావం, ఈ విద్వేష విషం, ఈ కార్పణ్య జ్వాలలు దేనికి ?

మనుషుల్లో మానవత దృష్ట్యా తరతమ భేదాలుండటానికి వీల్లేదు.

భేదం ఏదయినా ఉంటే అది కేవలం మనుషుల ఆలోచనలు, ఆచరణల రీత్యా

మటుకే సాధ్యం. మానవుని నిజ ప్రభువు చెప్పేదీ అదే :

"మానవులారా, మేము మిమ్మల్నందరినీ ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము. ఆ తరువాత మిమ్మల్ని జాతులుగా, తెగలుగా చేశాము - మీ పరస్పర పరిచయ సౌలభ్యానికి! నిజానికి మీలో అత్యధికంగా భయభక్తులు కలవాడే అమితంగా ఆదరణీయుడు."

*(49 : 13)*



# అన్నీ చేసేవాడు ఆ ఒక్కడే!

సుందరమయిన విశ్వంలో మరెంతో సొగసుగా అలరారే పుడమి. భూమి అంతటా, అందంగా, మనోజ్ఞంగా, మనోహరంగా పానుపులా పరచుకున్న నేల. జీవించడానికి ఎంతో అనువైన, ఆహ్లాదకరమయిన ఇక్కడి వాతావరణం! ఇక్కడే ఆహారం - పండ్లు ఫలాలు, ఇంకా మరెన్నో భోజన పదార్థాలు - నేలపై, నీటిలో, నింగిలో తేలియాడుతూ!

అంతేకాదు, మానవ జీవితానికి అవసరమయిన వెలుతురూ, వేడిమీ, వాయువులనిచ్చే, వానలు కురిపించే గగనతలం. మానవ మనుగడకు ఎన్నెన్ని ఏర్పాట్లు!

ఆలోచిస్తేనే మేను పులకరిస్తుంది. హృదయంలో కృతజ్ఞతాభావం మొగ్గ తొడుగుతుంది. అంతర్యం వినమ్రమవుతుంది.

వేడిమిని, వెలుగును సమతులనంతో ప్రసాదించే ఒక్క సూర్యగోళం, దాని కుటుంబాన్ని, దాని పరిభ్రమణ మార్గాలను పరిశీలిస్తేనే బోధపడుతుంది - అది రెప్పపాటు కాలం గాడి తప్పితే ప్రపంచ వ్యవస్థకు ఎంత ముప్పు వాటిల్లుతుందో! అలాగే వర్షాలు బాగా కురియకపోయినా, అమితంగా కురిసినా ఎన్నెన్ని ప్రమాదాలు మనిషి ఎదుర్కోవలసి వస్తుందో కూడా మానవునికి అనుభవైక వేద్యమే.

సూర్యచంద్ర నక్షత్రాదుల పరిభ్రమణాల వల్లనూ, వానలూ వాయువుల వల్లనూ ఈ నేల పులకిస్తుంది. పచ్చికలు కప్పుకుంటుంది. వృక్షాలు పెంచుకుంటుంది, ధాన్యాలు, పుష్పాలు, ఫలాలు అందిస్తుంది, మనిషి జీవికకై సామగ్రిని సమకూరుస్తుంది.

ఎన్నెన్ని మహోపకారాలు చేశాడు ప్రభువు తన దాసులకు! వీటికి బదులుగా మనిషి తన ప్రభువు పట్ల ఎంత విధేయుడయి మెలగాలి! ఎంత వినమ్రతతో వ్యవహరించాలి!!



ప్రభువు కోరేది కూడా అదే:



“మానవులారా! మీ ప్రభువు దాస్యానికి సన్నద్ధులుకండి. మిమ్మల్నీ, మీకు పూర్వం గతించిన వారినీ, అందరినీ సృష్టించినది ఆయనే. ఆయన పట్ల దాస్యభావన ద్వారానే మీరు రక్షించబడే అవకాశం ఉంది. ఆయనే కదా మీ కొరకు నేలను చక్కగా పరచినది; ఆకాశపు కప్పును నిలిపినది; పై నుండి నీటిని కురిపించినది; తద్వారా అన్ని రకాల పంటల్ని పండించి మీ కొరకు జీవికను అందజేసినది! ఇదంతా మీరెరిగినప్పుడు ఇతరుల్ని దైవానికి ప్రత్యర్థులుగా పరిగణించకండి.”

*(2 : 21,22)*



# మార్గం సుగమమవుతుంది !

మనిషి మనుగడే ఓ సంఘర్షణ - నిరంతర సంఘర్షణ. మనిషి సత్య పథాన్ని అనుసరించాలనుకుంటే ఆ సంఘర్షణ మరింత విస్తృతమవుతుంది - మరింత తీవ్రతరమవుతుంది.

అది సర్వతోముఖమయిన సంఘర్షణ, సర్వవ్యాప్తమయిన సంఘర్షణ - అంతంకాని పోరాటం.

ఆ పోరాటం పైశాచిక శక్తులతో సాగుతుంది. అవి మనిషిని, అనుక్షణం మంచిని ప్రేమించడంవల్ల కలిగే నష్టాలను గురించి హెచ్చరిస్తాయి. మంచిని ఆచరించడంవల్ల ఎదురయ్యే బాధలను ఎత్తిచూపి భయపెడతాయి. మంచివల్ల మూసుకుపొయ్యే భవితవ్యపు ద్వారాలను చూపి భీతిల్లజేస్తాయి.

అవి చెడులోని రుచుల్ని ఒక్కొక్కదాన్నే ప్రదర్శించి మభ్యపెడతాయి. చెడువల్ల కలిగే ప్రయోజనాలను గణించి ఆశ గొలుపుతాయి. చెడు తెచ్చిపెట్టే సుఖ భోగాల లాలస చూపి నోరూరిస్తాయి.

ఈ శక్తులతో పోరాడాలి.

ఈ సంఘర్షణ మనిషి మనస్సుతో కూడా సాగుతుంది.

అది సదా తన కాంక్షలకు మనిషిని దాసునిగా చెయ్యాలని ఎత్తులు వేస్తుంది - వత్తిడి తెస్తుంది. అది ఇంటిగుట్టు తెలిసింది కాబట్టి ఎన్ని ద్వారాల గుండా ప్రవేశిస్తుందో మనిషికి పూర్తిగా మునిగిపొయ్యేవరకు బోధపడదు. అది తోడు దొంగ గనక, అది తెరిచే దొంగ దారులు మనిషిని ఏయే బాటలపై నడిపిస్తాయో బహు దూరాలకు పోయిన తరువాత గాని తెలిసిరాదు. అందువల్ల దానితో కూడా పోరాడాలి.

సొంత ఇల్లు మొదలుకుని బయటి ప్రపంచ మంతటితో మనిషి నిరంతర సంఘర్షణ సాగుతూనే ఉంటుంది.

అతని నమ్మకాలకు, సిద్ధాంతాలకు, దృక్పథాలకు వ్యతిరేకమయిన దృక్పథాలతో, ధోరణులతో, నైతిక సూత్రాలతో, ఆచార వ్యవహారాలతో,

నాగరికతా విధానాలతో, సామాజిక, సామూహిక నియమాలతో పోరాడవలసి ఉంటుంది.

ఈ సంఘర్షణ ఒకరోజు, ఒక నెల, ఒక సంవత్సరం కాదు, యావజ్జీవితం సాగవలసిన సంఘర్షణ.

జీవితంలోని ఏదో ఒక రంగంలో కాదు సకల జీవన క్షేత్రాల్లో సాగుతుంది; రేయనక పగలనక సాగుతుంది. ఈ సంఘర్షణ, ఈ పోరాటం మనిషి కత్తులుపట్టి, తుపాకులు పేల్చి, ఆయుధాలు ఉపయోగించి కాదు - భావాలను, ఆలోచనలను, ఆచరణలను తీసుకుని చేస్తాడు.

అయితే ఈ సంఘర్షణలో, ఈ పోరాటంలో ఎవరయితే చిత్తశుద్ధిని, దైవభక్తిని, మానవుల పట్ల అనురక్తిని తమ సర్వస్వంగా తీసుకుని మైదానంలోకి వస్తారో వారికి ప్రభువు హామీ యిస్తున్నాడు:

*"ఎవరయితే మా కొరకు సంఘర్షణకు సన్నద్ధులవుతారో వారికి మేము మా మార్గాలను చూపుతాము. నిస్సందేహంగా దేవుడు సదాచార సంపన్నులకే తోడయి ఉంటాడు."*

*(29 : 69)*



# ఒకే జంట నుండి మనమంతా ...

"ఏ మనిషిలో ప్రవహించేదయినా రక్తమే. మనుషులందరూ సమానులే" అని మనం అనుకుంటూ ఉంటాము. అయినా మనిషి మనిషికి మధ్య విచక్షణ కొనసాగుతూనే ఉంది.

నల్లవాడని, తెల్లవాడని, ఆర్యుడని, ద్రావిడులని, ఆది ద్రావిడులని, అగ్రవర్ణమని, అల్పవర్ణమని, ఆ కులమని, ఈ కులమని - ఎన్నో విభజనలు మన మధ్య ఇంకా పరిఢవిల్లుతూనే ఉన్నాయి.

పరస్పర పరిచయం వరకు పరిమితమయి ఉంటే ఈ విభజన కొంతవరకు సహించదగిందే.

కాని దీన్ని మనుషుల మధ్య నిమ్నోన్నతా భేదభావాలు సృష్టించడానికి దుర్వినియోగం చెయ్యడమే నేడు జరుగుతోంది.

ఈ విభేదాలు మనుషుల మధ్య అభేద్యమయిన హిమాలయాల్లాంటి అడ్డుతెరలు నిలబెట్టాయి, దాటలేని అగాథాలు కల్పించాయి, ఈదలేని సముద్రాలు సృజించాయి.

కేవలం వేదికలనెక్కి ఉపన్యాసాలివ్వడం వల్ల ఈ అడ్డుగోడల్ని ఛేదించలేము. ఉపదేశాలతో దూరాలను పూడ్చలేము, చట్టాలద్వారా సాగరాలను చీల్చలేము. తరతరాలుగా మానవుని నరనరాల్లో జీర్ణించుకుపోయి అంతర్యంలో తిష్ఠవేసుకున్న ఈ విచక్షణా భావాన్ని రూపుమాపడానికి కేవలం హితబోధలు పని చెయ్యవు, ఆచరణ కావాలి. ఆచరణకు దృఢమయిన ప్రేరణకావాలి.

మానవుని కర్త, ప్రభువు, నిజస్వామి అందుకే మానవ జన్మ రహస్యాన్ని తెలిపి ఈ చిక్కును విడదీశాడు. అందులోని ఆదేశాన్ని అర్థంచేసుకున్న మహనీయులు దాన్ని అమలుపరిచారు. వారు 'బానిస' బిలాల్‌ని 'సర్దారు' చేశారు.'దాసీ వర్గ' పుత్రుడు జైద్‌కి, 'స్వామివర్గ' పుత్రిక జైనబ్‌నిచ్చి పెళ్ళి చేశారు. 'బానిస వర్గ' పుత్రుడు 'ఉసామ' ను 'అగ్రవర్ణ' యోధులకు నాయకుడుగా నియమించారు. కారణం? -

*"మానవులారా! మీ ప్రభువుకు భయపడండి, ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణిద్వారా సృష్టించాడు. దానినుండే దాని జతను సృజించాడు. వీరిద్దరి ద్వారా స్త్రీ పురుషుల్ని అసంఖ్యాకంగా జగతిలో వ్యాపింపజేశాడు."*

(4 : 1)



# 'జీవం' ఎవరి చేతుల్లో?

మానవుడు, తన బుద్ధి జ్ఞానాల ఆధారంగా మొత్తం విశ్వాన్నే చుట్టుముట్టి రాగలనని, గగనతలంలోని గోళాలు, గ్రహాలు, ఉపగ్రహాల రహస్యాలను ఛేదించగలిగానని, నేలపైన, నీటిలో నింగిలో సృష్టికి ప్రతిసృష్టి చెయ్యగలిగానని విర్రవీగుతున్నాడు.

ఇదంతా మనిషి సాధించగలిగాడంటే అది విశ్వప్రభువు ప్రసాదించిన బుద్ధి కుశలత మూలంగా, ఆయన అనుగ్రహించిన శక్తి సామర్థ్యాల ఆధారంగా, ఆయన సృష్టించిన పదార్థాల ద్వారానే గదా - అదే మరచిపోతాడు మానవుడు.

'ప్రతిసృష్టి' అని చెప్పుకుని ఎంత సంబరపడినా, అంబరాలను చుంబించానని ఎన్ని డాంబికాలు పలికినా, పాతాళాలలోకి పాకి పోవాలని ఎంత పాకులాడినా, మహా సముద్రాలను మధించాలని ఎంత మధనపడినా, మనిషి తాను చేతులారా సృష్టించుకున్న బహు దేవతల పూజను మటుకు దాటిపోయే స్థాయికి ఎదగలేక పొయ్యాడు.

మనిషి ఎన్ని చేసినా "ప్రాణ సృష్టి"ని సాధించలేకపొయ్యాడు, సాధించలేడు అన్నది ఎవ్వరూ కాదనలేని యదార్థం.

'జీవి' 'జీవిత' పదార్థ ఉత్పత్తి, పునరుత్పత్తి మటుకు విశ్వ పాలకుడు నిర్ణయించిన పంథాలోనే సాగగలదు.

మనిషి ఎంత జేసినా ప్రాణం పొయ్యలేడు.'జీవ' ప్రదానం, నిఖిల జగతికి కర్త, స్వామి, ప్రభువయిన దైవానికి మటుకే సాధ్యం. కాని మనిషి ఎటు పోతున్నాడు?

*"మానవులారా ! ఒక ఉపమానాన్ని ముందుంచడం జరుగుతోంది, సావధానంగా వినండి. దైవాన్ని కాదని మీరు మక్కువతో అర్థిస్తున్న ఆరాధ్యశక్తులు అన్నీ కలిసి ఒక్క "ఈగ"ను సృజించదలచినా అది సాధించలేవు. అంతేకాదు, ఈగ లాంటి అల్పజీవి వాటికి సమర్పించిన నైవేద్యాల నుండి దేన్నయినా తన్నుకుపోయినా అవి దాన్నుండి తిరిగి దక్కించుకోలేవు! అర్థించేవారూ బలహీనులే, అర్థింపబడేవారూ బలహీనులే!! వీరు దేవుని గొప్పదనాన్నే గుర్తించవలసిన రీతిలో గుర్తించలేదు. వాస్తవానికి శక్తిమంతుడు, గౌరవాధిక్యతలు గలవాడు దేవుడు ఒక్కడే.* (22 : 73,74)

# ఉపాధి అందజేసేదెవరు?

ఆకాశాల నుంచి కురిసే వాన అయినా, మట్టిలో నుండి పుట్టుకువచ్చే ధాన్య ఫలాదులయినా, నీటిలో లభ్యమయ్యే నిక్షిప్త సంపదలయినా అన్నీ మనిషికి అవసరమయినవే.

గాలి రాకపోయినా, నీరు లేకపోయినా, ఆహారం దొరక్కపోయినా, మనిషి మనుగడ ఒక్క క్షణం సాగగలదా!

ఈ జగతిలో మనిషి ఎంత శక్తిమంతుడో, ఎంత ఉత్తమ సృష్టియో, ఎంత మకుటాయమానమయినవాడో - ఇతని జీవనాధారమయిన ఈ సృష్టి కూడా అంతే గొప్పది, ముఖ్యమయింది.

మనిషి జీవితమూ నిర్హేతుకం కాదు, ఈ సృష్టి నిరర్థకం కాదు. ఈ రెండూ పరస్పర పూరకాలు! రెంటికీ అవినాభావ సంబంధం!! ఈ సత్యాన్ని మరచిపోతే .... ఎలా?

సృష్టి యావత్తూ అకస్మాత్తుగా, యాదృచ్ఛికంగా, ఏ పథకమూ లేకుండా, ఎవరి ప్రణాళికకూ లోబడకుండా, ఏ కార్యక్రమం ప్రకారమూ కాకుండా ఉనికిలోకి వచ్చిందంటే, మనిషి మనుగడకు ఓ అర్థమంటూ, దానికి ఓ పరమార్థమంటూ లేదని అంటే నమ్మశక్యమవుతుందా??

అంతా ఓ మహాలక్ష్యంతో, మహత్తర ఆశయంతో, మహోన్నత కార్యసిద్ధికై ఉనికిలోకి వచ్చిందని చాటడానికి సృష్టిలోని క్రమబద్ధత, నియమానుగత చలనాలే చాలు.

వీటిని పరిశీలిస్తూ, గమనిస్తూ కూడా మనిషి మోసపోతూ ఉంటే తనకు, తన ఉనికికి అర్థాన్ని మరచిపోయి అర్థంలేని ఆలోచనా వంచనల పంచన చేరడం ఎంత విచారకరం?

*"జనులారా, మీకు దైవం చేసిన ఉపకారాలను గుర్తుంచుకోండి. ఆకాశం నుండి, భూమి నుండి మీ జీవికను అందజేసేవాడు దైవం కాక మరో కర్త ఎవరయినా ఉన్నాడా? ఆయన తప్ప మరో దేవుడు లేడు. అయినా మీరు ఎలా వంచనకు గురవుతున్నారు?"* (35 : 3)

# ఆనాడు!

వాతావరణమంతా ప్రశాంతంగా ఉంది. ఎవరి పనుల్లో వారు తలమునకలయి ఉన్నారు.

కర్మాగారాల్లో యంత్రాలు తమకు ఏదీ పట్టనట్టుగా రొమ్ము విరుచుకుని దడదడలాడుతున్నాయి.

రైళ్ళు, బస్సులూ పృథ్వీ మూపురంపైన స్వైరవిహారం చేస్తున్నాయి.

కాలాన్ని చీల్చుకుంటూ వాతావరణంలో నుంచి దూసుకుపోతున్నాయి వాయు వాహనాలు.

కార్యాలయాల్లో కలాలు, గళాలు, అక్షర యంత్రాల లక్షలు, కొత్తగా వచ్చి చేరిన నేస్తాలు సూపర్ కంప్యూటర్లు కలగలిసి కాలాన్ని ముందుకు తోసుకుపోవడానికి శక్తులన్నీ కూడదీసుకుని యత్నిస్తున్నాయి.

తల్లి ఒడిలో వెచ్చగా ఒదిగి, యెదలో నుండి పొంగి పొరలే గోరువెచ్చని క్షీరధారను గ్రోలుతూ ఆనంద కెరటాల్లో కేరింతలు కొడుతున్న పాపాయి; ఆ పాపాయి ముఖపద్మంలో వెలిగే కోటి జ్యోతుల వెలుగుల్ని కళ్ళల్లో నింపుకుని పారవశ్యంలో తేలియాడాలని ఉవ్విళ్ళూరే మాతృమూర్తి ఒకరిలో ఒకరు లీనమయిపొయ్యారు.

తన కలల పంట, ప్రేమానురాగాల మధుఫలం, ఆశల ఉద్యానవనం ఉల్లంలో పొరలుతూ గిలిగింతలు చేస్తుంటే ఆనంద ప్రభంజనాలలో తేలియాడుతూ, ఎదిగిన తన పొత్తి కడుపుని మురిపెంగా నిమురుకుంటూ మురిసిపోతోంది కాబోయే తల్లి.

జగమంతా హాయిగా, నెమ్మదిగా తన కర్తవ్యాన్ని నిర్వహించే విధేయతాతత్పరతగల సేవకిలా సాగిపోతోంది, భూమండలం ఒయ్యారంగా నాట్యమాడుతూ, జీవకళను క్షణక్షణం పెంపొందించుకుంటూ, తన అనంత నర్తనను ప్రదర్శిస్తోంది.

అకస్మాత్తుగా క్షణ కాలంలో అంతా నిశ్చలమయిపోయింది. అప్పుడు ఓ



కుదుపు. జగమే తల్లడిల్లిపోయింది. అంతా తల్లక్రిందులయిపోయింది. అదో ప్రకంపనం, జగతినే మూర్ఛగొలిపిన ప్రళయం. ఆనాడేమవుతుంది?

"జనులారా, మీ ప్రభువు ఆగ్రహాన్ని తప్పించుకోండి. యదార్థానికి ప్రళయంనాటి ప్రకంపనం మహా భయంకరమయింది. మీరు దాన్ని కాంచిననాడు పరిస్థితి ఎలా ఉంటుందంటే, పాలుపట్టే ప్రతి మహిళ పాలు త్రాగే తన పాపాయిని విస్మరిస్తుంది. గర్భవతి అయిన ప్రతి స్త్రీ గర్భం పడిపోతుంది. ప్రజలు మైకంలో, మైమరచిన స్థితిలో నీకు కానవస్తారు. కాని వాస్తవంగా వారు మత్తుగొని ఉండరు - దైవం పంపిన యాతనే అంత తీవ్రంగా ఉంటుంది."

*(22 : 1-2)*



# నీ ఉనికే నిదర్శనం!

ఏ మానవ దృష్టికీ అందని చీకటి కుహరంలో రెండు అపరిచిత పదార్థాలు పరస్పరం కలుసుకుంటాయి. ఒక దానిలో ఒకటి లీనమయి, ఏకమయి కొత్త రూపు ధరించి వళ్ళు విరచుకుని కొత్త జీవం పోసుకుని మేల్కొంటాయి. ఆ కొత్త రూపు పెరిగి పెద్దదయి చీకటి కుహరంలో నుంచి వెలికి వస్తుంది.

ఇలా వేన వేలు జీవాలు, ప్రపంచమంతటా వేలాది చీకటి గృహాల్లో కలుసుకుని లక్షలాది రూపులు ధరిస్తూ ఉంటాయి. ఒక్కో రూపు ఓ కొత్తదనాన్ని సంతరించుకుని వికసిస్తుంది. ఏ రూపమూ మరో రూపాన్ని పోలి ఉండదు, ఏ రూపమూ మరో రూపానికి సమానం కాజాలదు - రూపంలోనూ, గుణంలోనూ!

ఒకే రకం ప్రక్రియ ద్వారా, ఒకే రకం సాధనాల ద్వారా, ఒకే రకం పదార్థం ద్వారా ఉనికిలోకి వచ్చే ఈ రూపాల్లోని వైవిధ్యం, కొండొకచోట వైరుధ్యం బహు విచిత్రమయింది, అపురూపమయింది.

ఈ రూపాల్లో పరిపూర్ణ కళాత్మకమయినవీ, కళలంటే ఏ మాత్రం పొసగనివీ ఉంటాయి. విజ్ఞానప్రదమయినవీ, వైజ్ఞానికపంథాకు ఆమడ దూరాన పోయేవీ అనేకముంటాయి. వీరత్వం, ధీరత్వం గలవి కొన్నయితే శౌర్యం, క్రౌర్యం మిళితమయినవి మరికొన్ని.

పరిపూర్ణ ఆయురారోగ్యాలతో పరిపక్వతకు చేరేవి కొన్నయితే ప్రారంభంలోనే రాలిపొయ్యేవి ఎన్నో. ఇంకా ఔన్నత్య శిఖరాలకు చేరి ఏకాయెకీన పతనమయ్యేవి యెన్నెన్నో! సంపూర్ణ సౌష్ఠవంతో అలరారేవే కాక అష్ట వక్రతలతో సతమతమయ్యేవి అనేకముంటాయి.

ఏ ఆకృతి, ఏ గుణగణాలు, ఏ లక్షణాలుగల రూపాలు ఎన్నెన్ని కావాలో, ఎప్పుడెప్పుడు కావాలనేది ఏ నిర్ణయాల కనుగుణంగా సాగుతోంది?

ఏ పథకం ప్రకారం ఈ జీవన కర్మాగారం సతతం తన విధుల్ని నిర్వర్తిస్తోంది?? ఈ పరిణామ క్రమానికి అంతం ఏది???

"జనులారా! మృత్యువుకు తరువాత ప్రాప్తమయ్యే జీవితంపట్ల మీకు అనుమానం ఉన్నట్లయితే మీరు తెలుసుకోవలసిందెంతో ఉంది: మేము మిమ్మల్ని మట్టితో సృజించాము. తిరిగి రేతస్సు ద్వారా, తరువాత నెత్తుటి ముద్ద నుంచి, ఆ తరువాత మాంసపు కండరం నుంచి - అది స్పష్టమయిన ఆకారం గలదీ, ఏ ఆకారమూ లేనిదీ కావచ్చు - సృష్టిస్తాము - (ఇదంతా చెప్పేది) మీకు యదార్థ విషయం ప్రస్ఫుటపరచాలని. మేము కోరిన (రేతస్సు బిందువును) నిర్ణీత కాలం వరకే గర్భాశయంలో నిల్వనిస్తాము. ఆ తరువాత మిమ్మల్ని ఓ శిశువు రూపంలో వెలికి తీసుకువస్తాము. (మిమ్మల్ని పోషిస్తాము -) మీరు పూర్తిగా యవ్వనానికి చేరాలని. మీలో ఒకరిని ముందుగానే పిలువనంపుకుంటే మరొకరిని నికృష్టమయిన వయోస్థితికి చేరనిస్తాము. అప్పుడు అతను అన్నీ తెలిసిన స్థితి తరువాత ఏదీ తెలియని స్థాయికి చేరుకుంటాడు. మీరు చూస్తూనే ఉంటారు. నేల ఎండి ఉంటుంది. మేము దానిపై వాన కురిపించగానే అకస్మాత్తుగా అది పులకిస్తుంది. వికసిస్తుంది. అది రకరకాల మనోహరమయిన పచ్చికల్ని వెలికి తెస్తుంది. ఇదంతా జరగడానికి కారణం - దేవుడు, ఆయనే సత్యం గనక. ఆయన మృతులను బ్రతికిస్తాడు. అన్నింటి పైనా అధికారం గలవాడు, ఇది - ప్రళయ ఘడియ వస్తుందనడానికి నిదర్శనం అందులో ఏ మాత్రం సందేహానికి ఆస్కారం లేదు. గోరీలలో చేరినవారి నందరినీ దైవం తప్పకుండా లేపుతాడానడానికి ఇది నిదర్శనం."

(22 : 5-7)



# ఎవరూ, ఎవరికీ ఏమీకాని నాడు!

మధ్యాహ్నం మూడు గంటల సమయం. నడిరోడ్డున పోటీపడి పరిగెడుతున్న మోటారు వాహనాలు, బడలికతో నడవలేక నడుస్తున్నట్లున్న ఎడ్ల బండ్లు. అప్పుడప్పుడు, అక్కడక్కడ కాలి నడకన వచ్చిపొయ్యే మనుషులు – రోడ్డు రద్దీగా నయితే లేదు. అందుకే నేమో మోటారు వాహనాలను పరిగెత్తించేవారు అవకతవకగా వంకర్లుపోతూ 'కట్లు' కొడుతూ నడుపుతున్నారు.

అకస్మాత్తుగా ఓ బస్సు రెండు 'కట్లు' కట్ చేసి మూడవసారి పక్కకు ఒరిగిపోయింది... ఎత్తుగా ఉన్న రోడ్డు నుండి దొర్లుకుంటూ పోయి తలకిందులుగా ఆగిపోయింది.

అరుపులు, కేకలు, హాహాకారాలు!

బస్సులోని జనం ఎవరికి తోచినట్లువారు బయటపడడానికి ప్రయత్నిస్తున్నారు. బస్సులో పడిపోయిన వారు ఒకరు మరొకరిని చూసుకోలేని పరిస్థితి.

అందరూ కిందపడ్డ వారిపైన నడుచుకుంటూనే పోతున్నారు. పడిపోయినవారు తమపై ఒక్కో అడుగు పడుతోంటే ఒక్కో గావు కేక పెడుతున్నారు, లేవలేకపోతున్నారు.

బయటికి వచ్చినవాళ్ళు ముందు తమ కాళ్ళూ చేతులూ భద్రంగా ఉన్నాయో లేదో చూసుకుంటున్నారు.

ఒక్కొక్కరికి కొన్ని నిముషాల తరువాత గాని ఇతరులు గుర్తుకు రావడం లేదు – 'అయ్యో, నా కొడుకేడి?' ...'ఓ ...నా బాబేడి' ...'మా నాన్నేడి?...' వెదుకుంటున్నారప్పుడు అందరూ!



అప్పటికిగాని వాళ్ళకు తెలిసి రాలేదు – తాము తమ వాళ్ళ శరీరాలపై నుండే నడుచుకు వచ్చామని! ఆపద సమయంలో ఎవరికి వారే యమునా తీరే అనీను!!

చిన్న ప్రమాదానికే ఇంత హైరానా పడిపోతే... ఇంత స్వార్థంతో మసలుకుంటే ప్రళయ దినం ఎలా ఉంటుంది?



మనిషి ప్రపంచ జీవితంతో పడి పరలోకాన్నీ తన పరమ ప్రభువునీ మరచిపోతున్నాడు, ఇక్కడ కనిపించేదే శాశ్వతమని భ్రమపడుతున్నాడు, జీవితం అంటే ఇదే అని మోసపోతున్నాడు.

ఈ లోకం, ఇక్కడి ఆకర్షణలు, వీటిని ఎరగా చూపి వీటికి లొంగిపొయ్యేలా చేసే శక్తులు అన్నీ మనిషిని నమ్మించి మోసం చెయ్యబోతున్నాయని యెప్పుడు తెలుసుకుంటాడు మనిషి - ఇంకెప్పుడు?

"ప్రజలారా! మీ ప్రభువు ఆగ్రహాన్ని తప్పించుకోండి. ఆ రోజు పట్ల భయపడండి. ఆనాడు, ఏ తండ్రీ తన తనయునికి బదులుగా పరిహారమివ్వడు, ఏ తనయుడూ తన తండ్రికై ఏ వస్తువూ పరిహారమిచ్చేవాడు కాడు. నిజానికి దేవుని మాట నెరవేరుతుంది. కాగా, ఈ ప్రపంచ జీవితం మిమ్మల్ని మోసపుచ్చరాదు. మరే మోసగాడూ మిమ్మల్ని మోసంలో పడవెయ్యరాదు, జాగ్రత్త!"

(31 : 33)



# జాగ్రత్త, మోసపోకు!

మనిషి రకరకాలుగా వంచనకు గురయి ఉన్నాడు. అతన్ని తన బుద్ధి బలమే మోసంలో పడవేస్తోంది.

వివేచన, విచక్షణ, విజ్ఞానం, విజ్ఞత - మనిషి 'తెలివి'కి ఎన్ని కోణాలు! ఎన్నెన్ని రూపాలు!!

ఈ బుద్ధిబలాన్ని పురస్కరించుకునే మనిషి తన సమస్యలన్నింటినీ మరే శక్తి సహాయం లేకుండా తానే పరిష్కరించుకోవాలని ఉబలాటపడతాడు.

అంతేకాదు నన్ను మించిన తెలివి మరే శక్తికి ఉంది? నా జీవిత పయన మార్గం స్వయంగా నేనే నిర్ణయించుకోలేనా? అని విర్రవీగుతాడు.

ఇదంతా అతి తెలివి వ్యవహారమని, మొండి సాహసమని మనిషి చేసిన యెన్నో ప్రయోగాలు చాటి చెప్పాయి. అయినా ఈ దుస్సాహసానికి పాల్పడేందుకు వెరువడం లేదు మనిషి! ఇంతకంటే గొప్ప ఆత్మవంచన మరేది కాగలదు?

తనకున్న 'శక్తి'ని, అనేక ప్రకృతి శక్తులపై తనకుగల ఆధిపత్యాన్నీ చూసి 'నేనే రారాజును' అని భ్రమపడుతుంటాడు మనిషి.

తనను కూడా శాసించే ఓ శక్తి ఉందని, తన కుచేష్టలకు అడ్డుతెర పడనున్నదని, తన వ్యవహారమంతా మహోన్నత న్యాయస్థానంలో విచారించి తన స్థానాన్ని నిర్ణయించడం జరుగుతుందని, తదనుగుణంగా సుఖమయ స్వర్గ జీవితమో, వినాశమయ నరకయాతనో తనకు సంప్రాప్తమవుతాయని ఎవరు ఎన్ని విధాల చెప్పినా మనిషి తలకెక్కదు.

ప్రశ్నించే శక్తి ఉన్నా అది కరుణా స్వరూపమని, యెన్ని అపరాధాలు చేసినా మన్నిస్తుందని, యెన్ని నేరాలు చేసినా శిక్షించదని తన కారుణ్యం కారణంగా, మనిషి పట్ల ప్రేమ కారణంగా శిక్షించడం అన్నది అసలు జరగదని భ్రమిస్తాడు మనిషి.

ఈ రకరకాల భ్రమలకు, వంచనలకు గురిచేసేది మనిషి మనసూ కావచ్చు. మనిషిని మోసపుచ్చే దుష్ట శక్తులూ కావచ్చు.

ఎవరి అంతిమ దశ అయినా ఘోరాతిఘోరంగా పరిణమించడం యెవరికి ఇష్టం? సత్య తిరస్కార వైఖరికి పరిణామం సుఖప్రదమయిందిగా ఎలా రూపొందగలుగుతుంది??

"జనులారా, దైవం చేసే ప్రమాణం నిస్సందేహంగా సత్య ప్రమాణం. కనుక ప్రపంచ జీవితం మిమ్మల్ని మోసంలో పడవెయ్యకుండా, ఆ 'పెద్ద మోసగాడు' మిమ్మల్ని దైవం విషయంలో మోసపుచ్చకుండా జాగ్రత్తపడండి. వాస్తవానికి షైతాన్ మీ బద్ధ శత్రువు. వాడిని శత్రువుగానే పరిగణించండి. వాడు తన అనుయాయుల్ని తన మార్గానికి పిలువడానికి కారణం, వారు నరక పాత్రులు కావాలన్నదే. తిరస్కార వైఖరిని అవలంబించే వారికి ఘోర యాతన ప్రాప్తమవుతుంది. విశ్వసించిన వారికి, సత్కార్యాలు ఆచరించినవారికి దైవం తరఫున క్షమాభిక్ష, గొప్ప ప్రతిఫలం లభిస్తాయి."

(35 : 5-7)



# మార్గం చూపగలవాడు ఆయనే!

బుద్ధీ జ్ఞానాలలో అసమానుడయిన మానవుడు ప్రకృతిలో ఆవిష్కరించని కోణాల్లేవు; జీవితంలో అన్వేషించని క్షేత్రాల్లేవు.

కనుగొన్న సిద్ధాంతాలు అనేకం, అవలంబించిన ఆచారాలు అసంఖ్యాకం, స్థాపించిన సంప్రదాయాలు అగణ్యం.

సహస్రాబ్దుల పరిశోధన శతశతాధిక తరాల పరిశ్రమ మిగిల్చిందేమిటి?

మనిషి భౌతిక అవసరాలకు మార్గం సుగమమయింది. మనుగడలో అనేక సౌలభ్యాలు ఒనగూడాయి. ఎన్నో సౌకర్యాలు సమకూరాయి.

ధరిత్రి జీవించడానికి అనువయిన మనోహర మనోజ్ఞ నివాసమయింది.

కాని, మనిషి మానసిక తృష్ణ తీరలేదు.

ఆత్మ ఆవేదనా జ్వాల ఆరలేదు.

అశాంతి అసంతృప్తి ఆంతర్యాన్ని ఆవహించాయి.

ఓ తత్వవేత్త పలికినట్లు, పక్షుల్లా ఎగరడం నేర్చుకున్నా, చేపల్లా ఈదడం అభ్యసించినా మనుషుల్లా బ్రతకడం మనిషికి రాలేదు. మృగాల్లా చీల్చుకు తింటున్నారు ఒకరినొకరు.

అసమాన విజ్ఞానం, ప్రజ్ఞాపాటవాలు గల మనిషి స్థితేనా ఇది? ఆశ్చర్యం కలగదూ?



సకల భౌతిక సామగ్రిని సరఫరా చేసిన విశ్వప్రభువు మానవుని ఈ మానసిక, ఆధ్యాత్మిక అవసరానికిగాను ఏర్పాట్లు చెయ్యలేదా?

ఆయన సర్వోపరిజ్ఞాని, సర్వోత్కృష్ట వివేకి.

ఆయన మనిషిని మార్గహీన స్థితిలో యెన్నటికీ వదిలివేయడు. స్వతంత్రంగా ఆలోచించే మేధ, స్వేచ్ఛగా ఆచరించే శక్తి నిచ్చిన స్వామి ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ద్వారా మనిషి చిక్కుల్లో పడటాన్ని ఇష్టపడతాడా?

ఏ భావాలు సరయినవో, ఏ నమ్మకాలు సవ్యమయినవో ఏ ప్రవర్తన మేలయినదో, ఏ పద్ధతులు శ్రేయస్కరమయినవో చెప్పలేదా? అలా జరగడానికి వీల్లేదు. ఆయన తప్పకుండా మార్గం చూపి ఉంటాడు. కనుక్కోలేకపోవడం మానవుని దౌర్భాగ్యం! ప్రభువు సెలవిస్తున్నాడు:

"మానవులారా, ఈ ప్రవక్త మీ వద్దకు మీ ప్రభువు వద్దనుండి సత్యం తీసుకువచ్చాడు. దాన్ని విశ్వసించండి – అది మీకే శ్రేయస్కరమయింది. తిరస్కరించారా, ఒకటి మాత్రం తెలుసుకోండి ఆకాశాల్లోనూ, భూమిలోనూ ఉన్నదంతా సర్వమూ దైవానికి చెందినదే. ఆయన మహాజ్ఞానధనుడు, పరమ వివేచనా సంపన్నుడు."

(4 : 170)



# దైవ సందేశహరుడు !

సమాజంలో మంచి పనులు చేసినవారు, సంఘ సంస్కర్తలు, ప్రజాసేవకులు, సాహితీపరులు, విద్వాంసులు, ఘనమైన శాస్త్రీయ ప్రయోజనాలను అంద జేసినవారు - ఎంత ఉన్నతులయినవారయితే అంత వినమ్రులై ఉంటారు.

సాధారణంగా ఇలాంటి వారెన్నడూ తాము ఫలానా సేవ చేశామని చెప్పుకోరు.

ఒక్కోసారి ప్రజలు కూడా వారి వినయ వినమ్రతల్ని చూసి వారి ప్రతిభను గుర్తించలేకపోతారు. అందువల్ల ప్రపంచం నుండి నిష్క్రమించిన తరువాతే అలాంటి వారికి గుర్తింపు లభిస్తుంది.

కాని విశ్వ ప్రభువు వద్ద నుంచి ఆయన దాసులయిన మానవులకు ఆయన సందేశాన్ని అందజెయ్యడానికి వచ్చినవారు అలా వినయం ప్రదర్శించలేరు. వినయ వినమ్రతలు ముఖ్యంగా తమ బాధ్యతల విషయంలో వారికి శోభించవు.

వారు మొహమాటం లేకుండా 'నేను ఫలానా వాణ్ణి, మీ ప్రభువు వద్ద నుండి మీకు ఓ సందేశాన్ని తెచ్చాను' అని పలకకపోతే ఆయన అందజేసే సందేశానికి విలువా ఉండదు, వినేవారూ వుండరు.



విశ్వ ప్రభువు విదేయత విషయంలో ప్రజలు స్పష్టమయిన నిర్దేశాలే కోరుకుంటారు.

ఆ సందేశ నిర్దేశాలు అందజేసేవారు కూడా ప్రస్ఫుటంగా ముందుకు రావాలనే వారు ఆశిస్తారు.

ప్రభువు సందేశాన్ని గుర్తించి దానికనుగుణంగా జీవితం మలచుకోవడం ఎంత సౌభాగ్యవంతమో, ప్రభు సందేశహరుడు ప్రస్ఫుటంగా ముందుకు వచ్చిన తరువాత ఆయన్ని గుర్తించీ నమ్మకపోవడం కూడా మహాపరాధమే అవుతుంది. అందువల్ల దైవాజ్ఞనీ, దైవ సందేశాన్ని, దైవ సందేశహరుణ్ణీ నమ్మడమో, నమ్మకపోవడమో అన్నది సాధారణ విషయం కాదు. చాలా సున్నితమైన విషయం. అందుకే ప్రభువు తన ప్రవక్తనుద్దేశించి ఆదేశిస్తున్నాడుః

"ఓ ముహమ్మద్, ఇలా చెప్పండి, 'జనులారా, నేను మీ అందరి వైపునకు పంపబడిన దేవుని సందేశహరుణ్ణి. దేవుడు భూమ్యాకాశాల రాజ్యానికి ప్రభువు. ఆయన తప్ప మరే దైవం లేదు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు. మృత్యువునూ ఆయనే ఇస్తాడు. అందువల్ల దైవాన్నీ ఆయన పంపిన నిరక్షరాస్యుడయిన ఈ దైవ ప్రవక్తనూ విశ్వసించండి. (ఆ ప్రవక్త) దైవాన్నీ దైవాదేశాలనూ నమ్ముతాడు. ఆయన్ని అనుసరించండి, మీరు సన్మార్గాన్ని పొందగలరు."

(7 : 158)





# హెచ్చరిక చేసేవాడు !

ప్రపంచంలోని ఏ సంస్కర్త అయినా, ఏ బోధకుడయినా, ఏ విప్లవకారుడయినా చేసేదేమిటి? హెచ్చరిక ! 'ఇదో ప్రజలారా ఇప్పుడే చెబుతున్నాను, మీరు ఇలా మసలుకోకపోతే, అదో అలాంటి విసత్కార పరిణామాలు ఎదురవుతాయి! జాగ్రత్త !! ఇప్పుడే మేల్కొనండి. నే సూచించినట్లు నడుచుకోండి; బాగుపడతారు' ఇలాగే ఉంటుంది అతని హెచ్చరిక !!

లోకంలో ఆవిర్భవించిన ప్రవక్తలందరూ, సంఘాన్ని సంస్కరించిన సజ్జనులందరూ, వ్యవస్థను చక్కదిద్దిన మహనీయులందరూ చేసిన హెచ్చరిక, చెప్పిన సూక్తులు సూత్రప్రాయంగానే కొనసాగుతాయి.

అయితే సంఘ సంస్కర్తలు, రాజకీయ విప్లవకారులూ, దైవ ప్రవక్తల మధ్య కొంత వ్యత్యాసం ఉంటుంది.



సంఘ సంస్కర్తలు సంఘంలోని దురాగతాలను చూసి తమ బుద్ధి కుశలత ద్వారా, వివేచన, గత అనుభవాల ద్వారా, సంఘం పయనించే బాటను అర్థం చేసుకుని, దాని పరిణామాన్ని పసిగట్టి హెచ్చరిక చేస్తారు. ఇది చెడును ఊహించిచేసే హెచ్చరిక.

రాజకీయ నాయకులూ అంతే, ప్రజల్లో ప్రబలి ఉన్న అసంతృప్తిని, అసంతుష్టిని ఆధారంగా తీసుకుని ప్రత్యామ్నాయ వ్యవస్థను సూచించి ఆ ప్రత్యామ్నాయం కొరకు పాటుపడక పోతే రాగల ప్రమాదాలను గురించి, మూడగల కీడులను గురించి హెచ్చరిస్తారు. ఈ హెచ్చరిక కూడా ఊహాజనితమే.

కాని దైవ ప్రవక్తలు చేసే హెచ్చరిక 'సంపూర్ణజ్ఞానం' ఆధారంగా చేస్తారు. అది సకల లోక ప్రభువు, సర్వోపరిజ్ఞాని అయిన దైవం ప్రసాదించిన 'సత్యజ్ఞానం' ఆధారంగా చేసే హెచ్చరిక. సంఘ సంస్కర్తలు చేసే హెచ్చరికను ఖాతరు చెయ్యకపోతే ఏదయినా నష్టం కలిగినా అది తాత్కాలికమే కావచ్చు.

రాజకీయ నాయకులు చేసే హెచ్చరికల్ని పెడచెవిన పెడితే ఒక్కోసారి నష్టం కలగవచ్చు, ఒక్కోసారి "పొంచివున్న ప్రమాదం" కేవలం భ్రమగానే మిగిలిపోవచ్చు.

కాని సంపూర్ణ జ్ఞానం ఆధారంగా చేసే ప్రవక్తల హెచ్చరికను తప్పించుకొనడానికి దారిలేదు. ఆ ప్రమాదం సంభవించడం తథ్యం. అది ఆషామాషీ ఊహాగానం కాదు. సత్యం ప్రాతిపదికగా చేసిన హెచ్చరిక. అలాంటిదే ఈ హెచ్చరిక :

*"ఓ ప్రవక్తా, ప్రకటించండి. జనులారా, నేను కేవలం, ముప్పుముూడడానికి ముందు మిమ్మల్ని స్పష్టంగా హెచ్చరించే ఒక వ్యక్తిని మాత్రమే ! ఆ తరువాత ఎవరయితే విశ్వసించి సత్కర్మలాచరిస్తారో వారికి క్షమాభిక్ష, గౌరవ ప్రదమయిన ఉపాధి లభిస్తాయి. మరెవరయితే మా వచనాన్ని కించపరచాలని యత్నిస్తారో వారే నరకసహవాసులు."*

*(22 : 49 - 51)*



# మార్గం చూపేవాడు ఆయనే !

మానవుడికి దేవుని మార్గదర్శకత్వం అవసరమా?

ఇది గొప్ప ప్రశ్న. మనిషి ఎన్నో విషయాలను స్వయంగానే పరిశోధించి, అర్థం చేసుకుని, తదనుగుణంగా నడుచుకుంటాడు. తనకు కావలసినవన్నీ సిద్ధం చేసుకుంటాడు.

కాని, కొన్ని విషయాలు అతనికి అంతుపట్టవు. ఉదాహరణకు ఈ జీవితం తరువాత మరో జీవితం ఉందా? లేదా?? అన్న ప్రశ్నకు మనిషి విజ్ఞానం ఏ సమాధానమూ నేటి వరకు ఇవ్వలేదు. అది సమకూర్చే సమాచారం దృష్ట్యా, మహా అయితే 'ఉందో లేదో తెలీదు.' అని మటుకే చెప్పగలవి అవుతుంది.

కాని, ఈ ప్రశ్న ఇదమిత్థంగా తేలనిదే మనిషి జీవన మార్గం తెల్లమవదు.

'లేదు' అని తెలుసుకుంటే ఏ చిక్కూ లేదు. మనిషి కూడా పశువులా హాయిగా ఎటువంటి బాధ్యతా భావం లేకుండా, విచ్చలవిడిగా, విశృంఖలంగా బతకవచ్చు. సమాజం, కుటుంబం, నీతి, నడవడి అన్నీ సాపేక్షక మయిపోతాయి. తనకు లాభకరమయిందే సత్యం. తనకు ఇష్టమయిందే సరి. విలువలు మారిపోతాయి. విధానాలూ మారిపోతాయి.



ఒకవేళ 'ఉంది' అని తెలిస్తే ఆ 'ఉన్న' జీవితానికి తగిన రీతిలో మసలు కోవడం, దాని ఆధారంగానే బాధ్యతలు, నీతి నియమాలు ఏర్పరచుకోవడం, దానికనుగుణంగానే విలువల్ని, ప్రమాణాలను ఎన్నుకోవడం అవసర మవుతుంది.

ఇంతకూ జీవన గమనానికి, ఈ ప్రశ్నకు, ఇంకా ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవడం మనిషికి ఎంతో అవసరం. అప్పుడే అతని మనుగడ సాఫీగా సాగుతుంది.

ఈ ప్రశ్నలకు సమాధానాలు మనిషి వద్ద లేవన్నది సుస్పష్టం.

వాటిని అందజేసే మూలాధారం, సర్వ సృష్టికి కర్త, విశ్వ వ్యవస్థకు ప్రభువు, సర్వోపరిజ్ఞాని అయిన శక్తి ఒక్కటే. ఆ శక్తి ద్వారా లభించే మార్గదర్శకత్వమే

మనిషి మనుగడను సవ్యంగా తీర్చిదిద్దగలదు. ఆ మార్గదర్శకజ్యోతి సదా మనిషిని నిజగమ్యం వైపునకు చేర్చింది. అదే ప్రభువు పిలుపు.

"ప్రజలారా, మీ ప్రభువు వద్దనుండి మీ వద్దకు ప్రస్ఫుటమైన నిదర్శనం వచ్చేసింది. మేము మీ వద్దకు, మీకు అత్యంత స్పష్టంగా మార్గం చూసే జ్యోతిని పంపాము. ఎవరయితే దేవుని మార్గదర్శకత్వాన్ని స్వీకరిస్తారో, ఆయన శరణుకోరుతారో వారికి ఆయన తన కారుణ్యఛాయల్లో, అనుగ్రహాల నీడల్లో ఆశ్రయమిస్తాడు. తన దరికి చేరే రుజు మార్గాన్ని వారికి చూపుతాడు."

( 4 : 175 - 176)



# లోని జబ్బుకు మందు!

ఎన్ని రోగాలు, ఎన్నెన్ని మందులు!

మనుగడలో అడుగడుగునా ఎదురయ్యే చిక్కులన్నింటికీ కాకపోయినా కొన్నింటికయినా మూలం కనుగొని విడదీయాలని ప్రయత్నించాడు మనిషి.

రాజకీయ సమస్యలు ఉత్పన్నమైతే ఎన్నో రాజకీయ సిద్ధాంతాలు కల్పించుకుని వాటి ద్వారా తన జీవితం సుఖవంతం అవుతుందని భ్రమపడ్డాడు. ఎన్నో రాజకీయ వ్యవస్థల్ని వినియోగించి ప్రయోగాలు చేశాడు. చేస్తూనే ఉన్నాడు.

ఆర్థికమయిన ఇబ్బందులు ఎదురయినప్పుడు వాటికీ అనేక రూపాలుగా పరిష్కారాలను ప్రతిపాదించుకున్నాడు. చివరికి రాజకీయాలతో ఆర్థిక ప్రశ్నను ముడివేసి జీవితాన్ని స్వర్గతుల్యం చేసుకోవాలనుకున్నాడు. కొన్నేండ్లకే అది సరయిన మార్గం కాదని తెలుసుకున్నాడు. తానే చేజేతులా సృష్టించుకున్న ఆ ఉక్కుతెరల పద్మవ్యూహం నుంచి బయటపడేదెలా అని పడరాని పాట్లు పడుతున్నాడు.



సామాజిక రంగంలో స్వేచ్ఛ కావాలని ఉవ్విళ్ళూరాడు. విశృంఖలత్వం చేదు ఫలాలనందించింది. నైతికత సాపేక్షకమన్నాడు. స్వార్థం విలయతాండవమాడి జీవితాన్ని కకావికలు చేస్తోంది. మతం వ్యక్తిగతమయిందన్నాడు. జీవితంలో సమతులనం కొరవడి మనశ్శాంతి కరువయింది. ఇప్పుడు మరో అతివాదానికి పోయి విమిశ్ర ఆధ్యాత్మికత వైపు మొగ్గుతున్నాడు.

ఈ అపరిష్కృత సమస్యలన్నింటికీ కారణం మనిషిలోని మనస్సు. దాని ఆదేశాల మేరకు నడవడం వల్లనే మనిషి ఇన్ని ఇక్కట్లకు గురవుతున్నాడు. రుజుమార్గమేదో ఎరుగని మనస్సు వాస్తవంగా రోగగ్రస్తమయింది. అది బాగుపడితే బతుకు యావత్తు బాగుపడుతుంది. దాని నివారణోపాయమే మనిషికి కావలసింది అని అంటున్నాడు మనిషి కర్త, స్వామి:

"జనులారా, మీ వద్దకు మీ ప్రభువు వద్దనుండి హితోపదేశం వచ్చేసింది. ఇది అంతర్యాల్లోని రోగాల నివారిణి. దీన్ని స్వీకరించిన వారికిది మార్గదర్శకత్వం, కారుణ్య స్వరూపం. ఓ ప్రవక్తా, వివరించండి! ఇది దేవుని అనుగ్రహం, ఆయన దయ - ఆయన దీన్ని (మార్గదర్శక గ్రంథాన్ని, ఖుర్ఆన్‌ని) పంపాడు. దీని కారణంగా జనులు పండుగ జరుపుకోవాలి. ఇది ప్రజలు ప్రోగుచేసుకుంటున్న సంపదలన్నింటికంటే ఉత్తమమయింది."

(10 : 57,58)



# ఉపమానం!

"ఈ యేడు వానలు బాగా కురుస్తాయి. పంటలు అమితంగా పండుతాయి. పండ్లు, ఫలాలు, ధాన్యాలు పుష్కలంగా అందుతాయి. అంతటా సుభిక్షం రాజ్యమేలుతుంది." అని తన విజ్ఞాన వివేకాల ఆధారంగా అంచనాల మేడలు కడతాడు మనిషి. ఎన్నో కలలు కంటాడు, మరెన్నో పథకాలు వేసుకుంటాడు. ఏమేమో చెయ్యాలని ఊహా విహారం చేస్తాడు. పరిస్థితులన్నీ అతను తానా అంటే తందానా అంటున్నట్లే అగుపిస్తాయి.

ఏ యంత్రాల పట్టుకూ చిక్కకుండా, మరే ఊహల హస్తాలకూ అందకుండా వాతావరణం అకస్మాత్తుగా తన వేషం మార్చుకుంటుంది.

పెనుతుఫాను దూసుకువస్తుంది. సంద్రంలో సుడిగుండాలు తాండవమాడతాయి, ఉప్పెనలు పొంగుకు వస్తాయి.

కళకళలాడే పంటలు మట్టిపాలవుతాయి. తళతళ మెరిసే తోటలు తల్లక్రిందులవుతాయి, పశువులూ మనుషుల కళేబరాలు దిక్కులేని శవాల్లా, చీమల్లా, చీడ పురుగుల్లా కాకులూ, గద్దలూ, రాబందుల పాలవుతాయి.

మనిషి ఆశల మేడలన్నీ కుప్పకూలిపోతాయి, కలలన్నీ చెదిరిపోతాయి.

ఊహించని పరిణామాలకు బాధపడటం, దుఃఖించడం తప్ప మరేమీ చెయ్యలేని స్థితిలో పడిపోతాడు మనిషి.

ఈ జీవితం, ఇక్కడి సుఖభోగాలు, దీనికి సంబంధించి మనిషి కనే కలలూ సర్వం ఇంతే.



మనిషి అనుభవించాలనుకున్నవన్నీ అతనికి అందినట్లే అందిచేజారిపోతాయి. లేక అవే మనిషిని వదలిపోతాయి, లేదా మనిషయినా వాటిని వదలి వెళ్ళిపోవలసి వస్తుంది. అదే అంటున్నాడు ప్రభువు.

*"జనులారా, (దైవానికి వ్యతిరేకంగా మీరు సాగించే) మీ తిరుగుబాటు మీకే ఎదురు తిరుగుతుంది. ప్రపంచ జీవితంలోని కొన్నినాళ్ళ రుచులివి, (జుర్రుకోండి). ఆ తరువాత మీరు తిరిగి మా వద్దకే మరలిరావలసి ఉంది. అప్పుడు*

మీకు చూపిస్తాము మేము – మీరు చేస్తూ ఉండిందల్లా ఏమిటో! ఈ (ప్రాపంచిక జీవితపు (మత్తులో మునిగి మీరు మా నిదర్శనాలను ఉపేక్షిస్తున్నారు దాని) ఉపమానం ఇలా చెప్పవచ్చు: ఆకాశాన్నుండి మేము వర్షాన్ని కురిపిస్తే నేలపై మనుషులూ పశువులూ అంతా తినే పచ్చని పంట దట్టంగా పెరిగింది. ఆ తరువాత నేల సస్యశ్యామలమయి కనుల పండువుగా అలరారుతున్నప్పుడు, పొలాలు పుష్కలంగా పండి కళకళలాడుతున్నప్పుడు, వాటి యజమానులు 'మేమిక వీటిని కోసుకుని మా సొంతం చేసుకోవచ్చు' అని సంబరపడుతూ ఉన్నప్పుడు, అకస్మాత్తుగా రాత్రిపూటనో, పగటిపూటనో మా ఆజ్ఞ అయింది. వాటిని మేము మునుపు అక్కడ ఏమీ లేనట్లుగా నాశనం చేసివేశాము. ఈ విధంగా మేము నిదర్శనాలను విడమర్చి చూపుతాము – ఆలోచించే, అర్థం చేసుకునే వారి కొరకు."

*(10 : 23,24)*



# మీకే మంచిది!

మనిషి తాను సృష్టించుకున్న సిద్ధాంతాలను అనుసరించినా, పూర్వపు పద్ధతుల్ని కళ్ళు మూసుకుని పాటించినా, ఈ రెండు పరిస్థితుల్లోనూ అతను తన కాళ్ళకు తానే బంధాలు వేసుకుంటున్నాడన్నమాట.

అతను తనకు తెలియకనే అనేక శక్తులకు బానిస అయిపోతాడు.

తనకు ఏమాత్రం స్పృహ లేకుండానే ఇతరులకు విధేయత పాటిస్తూ జీవిస్తాడు.

అడుగడుగునా, అనుక్షణం అతన్ని అనేక శక్తులు లోబరచుకోవడానికి యత్నిస్తాయి.

అతను అనేక శక్తులకూ, వ్యక్తులకూ తెలిసీ, తెలీక దాసోహమంటూ ఉంటాడు.



మానవుడు నిర్మించుకున్న జీవన పంథాలలో ఉన్న ప్రత్యేకత అది.

దీనికి బదులుగా మనిషి తన ప్రభువుకు విధేయుడయి జీవిస్తే ఆ ఒక్క విధేయత అతనికి వేయిన్నొక్క విధేయతల సంకెళ్ళ బారినుండి విముక్తిని కలిగిస్తుంది. ఒక్క నిజ ప్రభువుకు లొంగడం మంచిదా లేక అనేక అవాస్తవిక దైవాలకు మొక్కుకోవడం మేలా?

మనిషి దైవాన్ని నమ్మడం, ఆయన ఆజ్ఞల్ని పాలిస్తూ బ్రతకడం అతనికే శుభకరం, అతనికే ప్రయోజనకరం. అదే సన్మార్గ గమనం, అదే సత్యధర్మ అనుసరణం.

అలాకాక దైవాన్ని కాదని, దైవ మార్గాన్ని వదలి అపమార్గం పాలవడం మనిషికే వినాశకరం, దైవాన్ని వదలినవాని జీవితానికి కుక్కల పాలయిన విస్తరికన్నా మేలయిన గతి ప్రాప్తం కాదు.

మార్గ విహీనులయిన వ్యక్తులయినా, సమాజాలయినా, జాతులయినా నేడు ఎన్నెన్ని ఇక్కట్లకు గురవుతున్నాయో, ఎలా రోజుకో దిశ, ఘడియకో మార్గం అవలంబిస్తున్నాయో, ఎలా వినాశ ద్వారాలను తెరుచుకుంటూ

మహావేగంగా పతన పాతాళాల వైపునకు పరుగులు తీస్తున్నాయో మనం చూస్తూనే ఉన్నాము.

ఈ వినాశ మార్గాలను ఎత్తి చూపి వాటి గమ్యమయిన సంపూర్ణ పతనాన్ని గురించి హెచ్చరించడమే దైవ సందేశహరుల బాధ్యత. ఆ బాధ్యతను గుర్తు చేశాడు ప్రభువు:

*"ఓ ప్రవక్తా, వారితో చెప్పండి. 'జనులారా, మీ సమక్షంలోకి మీ ప్రభువు వద్దనుండి సత్యం వచ్చేసింది. ఇక ఎవరు రుజుమార్గం అనుసరిస్తారో వారి సన్మార్గగమనం వారికే ప్రయోజనకరం కాగలదు. మరెవరయితే మార్గ విహీనులయ్యారో వారి మార్గ విహీనత వారికే వినాశకరంగా రూపొందుతుంది. నేను మీపై నియమించబడిన రక్షకుణ్ణి కాను.' ప్రవక్తా, నీవు మటుకు నీ వద్దకు వహీ (దైవవాణి) ద్వారా పంపబడుతున్న మార్గ బోధనను అనుసరించు (ఆ మార్గాన సహన స్థయిర్యాలతో) దైవం తీర్పు చేసే వరకు నిలకడచూపు. ఉత్తమ న్యాయనిర్ణేత ఆయనే."*

*(10 : 108,109)*



# పరమ విరోధి !

జీవరాసులన్నింటికీ ముఖ్యమయింది ఆహారం.

ఏమి తినాలి? ఏమి తినకూడదు ? అన్నది సదా మనిషిని చిక్కుల్లో పడవేసిన సమస్య.

శారీరక ఆరోగ్యానికి, మానసిక ఆరోగ్యానికి లాభకరమయినవేవి, హానికరమయిన వేవి అన్న విషయంలో సరయిన మార్గదర్శకత్వంలేనిదే మనిషి పప్పులో కాలు వెయ్యకుండా ఉండలేడు.

ఏ మార్గాల ద్వారా జీవికను సముపార్జించాలి ? ఏ మార్గాల అనుసరణ వల్ల సమాజానికి కీడు మూడుతుంది? అన్న ప్రశ్న కూడా మనిషిని అజ్ఞాత కాలం నుండి వేధిస్తూ ఉంది.

మనిషిని సృష్టించిన ప్రభువు, అతనికొరకు ఈ ప్రపంచం మొత్తాన్ని రూపొందించిన స్వామి, ఇందులో ఏది అతనికి ఏ విధంగా ఉపయోగకరమో, ఏది ఏ రూపంలో హానికరమో కూడా తెలిపాడు.

అనేక పదార్థాలు సాధారణ భుక్తికి హానికరమయినవి కాని ఔషధాలకు ఎంతో ఉపయోగకరమయినవి.



అయితే మానవునితోపాటే సహజీవనం సాగిస్తున్న దానవుడు మనిషికి రకరకాల ఆలోచనలు కల్పిస్తాడు, మంచిని చెడుగా, కీడును మేలుగా అలంకరించి చూపుతాడు ఆ భ్రమల్లోపడి మనిషి తన శరీరానికీ, హృదయానికీ హాని కలిగించుకోవడం సాధ్యమే. అందువల్ల సదా నిజస్వామి అందజేసిన మార్గదర్శకత్వం దృష్టిలో ఉంచుకుని మెలగాలి.

అంతేకాదు, మానవుణ్ణి పెడమార్గాన తీసుకుపోయే పైశాచిక శక జీవితంలోని చెడులన్నింటినీ చెయ్యడానికి మనిషిని పురికొలుపుత నీతి బాహ్యమయిన కార్యకలాపాలకు మార్గం సుగమం చేస్తాయి. విః అమృతంగా చూపిస్తాయి ముండ్లను పువ్వులుగా చిత్రిస్తాయి.

ఈ మాయాజాలం నుండి తప్పించుకోవడమే మహాకష్టకార్యమని బోధిస్తున్నాడు ప్రభువు :

"జనులారా, ధరణిలో ధర్మబద్ధమయిన వాటిని, పరిశుద్ధమయిన వాటినీ తినండి. షైతాన్ చూపిన మార్గాలపై నడవకండి. వాడు మీ పాలిటి బహిరంగ శత్రువు; చెడులకై, నీతి బాహ్యమయిన పనులకై మిమ్మల్ని ఆదేశిస్తాడు; దైవం చెప్పినట్లు తెలియని విషయాలను మీరు దైవం పేరిట పలకాలని నేర్పుతాడు."

*(2 : 168, 169)*



# ఆయన నిరపేక్షాపరుడు !

మనిషికి ఏమి కావాలన్నా సృష్టించుకోలేడు. అన్నీ ఈ ప్రపంచంలోని పశు, పక్షి, ఖనిజ, రసాయనిక సంపదలద్వారానే సాధించుకోవాలి.

ఏదయినా కనిపెట్టాలన్నా, కొత్తదాన్ని నిర్మించాలన్నా మనిషి నమూనాలు, దృష్టాంతాలు ఈ వ్యవస్థలో నుండే గ్రహించవలసి ఉంటుంది.

మనిషి తయారుచేసిన విమానాలయినా, జలాంతర్గాములయినా, రోదసి వాహనాలయినా, రాడార్‌సిస్టమయినా అన్నీ అతనికి ప్రపంచంలోని జీవరాసుల జీవనగమనం ద్వారా, అంతరిక్షంలోని తారకల ఊహారూపాల ద్వారా లభించిన ప్రేరణలే.

ప్రతిదానికీ మనిషి ప్రకృతిపై ఆధారపడవలసి ఉంది.

మనిషి అడుగడుగునా విశ్వప్రభువు సన్నిధిలో చెయ్యిచాచి అర్థించనిదే ఏదీ చెయ్యలేడు.

మనిషి నిత్య అగత్యపరుడు, ప్రభువు నిత్య ప్రదాత. ఆయన సర్వగుణ సంపన్నుడు, సమస్త సంపదలకు స్వామి, సకల స్తోత్రాలకు ప్రభువు.

నేడున్న సృష్టికి కర్త ఆయనే, రేపు రాబోయే సరికొత్త సృష్టికీ స్వామి ఆయనే.

మనిషి ఆయన్ని కాదని మరెటూ పోలేడు – ఈ విశ్వాన్ని దాటి ఎక్కడికయినా వెళ్ళడం సాధ్యమేనా ?

ఒకవేళ మనిషి దైవాన్ని తిరస్కరించాలనే నిర్ణయించుకుంటే – మానవ సృష్టిని అలా ప్రక్కకు నెట్టివేసి మరో సృష్టిని ఉనికిలోకి తెచ్చి దాని ద్వారా తన సృష్టి సామ్రాజ్యంలో తన నిర్మాణ పథకాన్ని అమలుపరచగలడాయన.

నిజానికి మనిషి విశ్వ ప్రభువును గుర్తించి తన జీవితాన్ని చక్కదిద్దుకుని ప్రపంచ వ్యవస్థలో సర్వత్రా సామరస్య వాతావరణాన్ని నెలకొలిపేందుకు కృషి చేసినట్లయితే అది అతనికే ప్రయోజనకరం.



అయితే మనిషి దాన్ని అర్థంచేసుకోవాలి, తదనుగుణంగా ఆచరించాలి. ప్రభువు కోరేది అదే :

"మానవులారా ! మీరు మాత్రమే దైవం సమక్షంలో అగత్యపరులు, దేవుడు నిరపేక్షాపరుడు, స్వతహాగా స్తవనీయుడు. ఆయన అనుకున్నట్లయితే మిమ్మల్ని తొలగించి మరో సృష్టిని దేన్నయినా మీ స్థానే తీసుకురాగలడు. ఇలా చెయ్యడం దైవానికి కష్టం కాదు.... ఎవరయితే పరిశుద్ధ విధానాలను పాటిస్తాడో అతను తనకే మేలు చేసుకుంటాడు. ఇంతకూ అందరూ దైవం వైపునకే మరలవలసి ఉంటుంది."

*(35 : 15 - 18)*



# దారితప్పిన వారి దారిలో పోకండి!

ప్రపంచం ఎప్పుడూ పూర్తిగా అజ్ఞానాంధకారంలో, దిక్కు తోచని స్థితిలో పడిపోలేదు.

సదా విశ్వకర్త తన సృష్టికి – సృష్టిలో శ్రేష్ఠమైన మనిషికి – మార్గం చూపుతూనే వచ్చాడు.

తొలినాడు ఆదిమానవునికి జ్ఞానజ్యోతి ఇచ్చి మరీ పంపాడు.

మనిషి దుర్వర్తన కారణంగాను, అజాగ్రత్త మూలంగానూ, దుష్ట సంకల్పం ఫలితంగానూ ఆ జ్యోతి ఆరిపోయినప్పుడల్లా దాన్ని తిరిగి వెలిగించే ఏర్పాట్లు చేశాడు విశ్వప్రభువు. కొత్త జ్యోతుల్నీ ప్రసాదించాడు.

ఈ మానవ జీవితం జ్యోతి లేకుండా ఏనాడూ సాగలేదు. దాన్ని అలక్ష్యం చేత మనిషి తన మార్గదర్శకత్వం కొరకు వాడుకోకపోతే అది వేరే విషయం. కాని దైవ మార్గదర్శకత్వకాంతి మటుకు మనిషికి బాట చూపడానికి ఇలలో సదా ప్రసరిస్తూనే ఉంటోంది.

ఈ మార్గదర్శక జ్యోతి వల్ల వెలుగులోకి వచ్చే అతి ముఖ్యమైన అంశం, దేవుని ఏకత్వం.

ఈ విశ్వానికి కర్త, స్వామి, ప్రభువు, పాలకుడు, మార్గదర్శి ఒక్కడే అన్నది సత్యం.

ఆ సర్వశక్తి మాన్యుడు మానవుడిని సతతం కనిపెట్టుకునే ఉన్నాడు.

మనిషి చెప్పేది, చేసేది, తలపోసేదీ అన్నీ ఆయనకు తెలిసినవే. ఆయన వినలేనిది లేదు, కనలేనిది లేదు, అనలేనిదీ లేదు, ఎరుగనిదీ లేదు.

ప్రపంచంలో అత్యంత నిగూఢమయిన మనస్సునూ అందులోని భావాలను తెలుసుకుంటాడాయన.

పూవులోని తావి ఇచ్చే సందేశాన్నీ వింటాడు. వెలుగు చొరబడని చీకటి పాతాళాల్లోని నల్లని గాలినీ ఆయన చూస్తాడు.

గ్రంథం ద్వారా, సంకేతం ద్వారా, తన దూతల ద్వారా, మానసిక ప్రేరణ ద్వారా ఆయన మనిషితో మాట్లాడతాడు.

ఈ మార్గాల ద్వారా మనిషికి ఋజుమార్గాన్ని చూపుతాడు. ఆ ఋజుమార్గాన్ని వదిలేసి ఇతర మార్గాలను అనుసరించే మార్గ విహీనులను అనుసరించకండని వారిస్తాడు :

*"వారిని అడగండి, 'మీరు దైవాన్ని వదిలేసి మీకు నష్టం కలిగించడానికి గాని, లాభం కలిగించడానికి గాని ఎలాంటి అధికారమూ లేని వాటిని ఆరాధిస్తారా? నిజానికి అందరి మొరలాలకించే వాడు, అన్నీ తెలిసినవాడు దైవమే' వారితో, 'గ్రంథవహులారా, మీ ధర్మంలో అధర్మంగా అతిశయానికి పోకండి. మీకు పూర్వం స్వయంగా తామే మార్గం తప్పి అనేక మందిని మార్గం తప్పించి ఋజుమార్గానికి దూరంగా తొలిగిపోయిన జనుల భ్రమలనూ, భ్రాంతులనూ అనుసరించకండి' అని చెప్పండి."*

*(5 : 76, 77)*



# కనబడని కారుణ్య ప్రభువు !

"ఆ రోజున మేము నరకాన్ని - నీవు నిండి పొయ్యావా ?" అని అడిగినపుడు అది, 'ఇంకా ఏమయినా పెడతావా?' అని అడుగుతుంది. ఉంటే ఇంకా తీసుకురండి కసిదీరా శిక్షిస్తాను అన్నట్లు !

అప్పుడు స్వర్గాన్ని నిష్టా పరాయణులయినవారి చేరువకు తీసుకురావడం జరుగుతుంది. అది ఏ మాత్రమూ దూరంగా ఉండదు. అటు స్వర్గ ప్రాప్తికై దైవం తీర్పు చెయ్యగానే ఇటు స్వర్గం ప్రత్యక్ష మవుతుందన్నమాట.

అప్పుడు దైవం ఇలా సెలవియ్యడం జరుగుతుంది : "ఇదో, ఇదే మీతో చేసిన వాగ్దానం - ఈ వాగ్దానం, అత్యధికంగా దైవం వైపునకు మరలేవాడు, ఇతోధికంగా తన మనోవాక్కర్మలను కనిపెట్టుకు వుండే వాడు, చూడకుండానే కారుణ్య ప్రభువు పట్ల భయభక్తులతో మెలిగేవాడు, ఏకోన్ముఖమయిన, ప్రేమార్పిత హృదయం కలవాడు అయిన ప్రతి వ్యక్తికీ వర్తిస్తుంది. ప్రవేశించండి, స్వర్గంలోకి సురక్షితంగా!

ఆ దినం అనంత జీవితంలోకి ప్రవేశ దినం. అక్కడ వారికి తాము కోరినదల్లా ప్రాప్తమవుతుంది. అంతేకాదు మా వద్ద వారు కోరిన దాని కన్నా మరెంతో అధికంగానూ లభిస్తుంది. వారు దాన్ని కలలోనయినా ఊహించి ఉండరు."

*"మేము వీరికి పూర్వం అనేక జాతుల్ని అంతమొందించాము. అవి వీరికన్నా అనేక రెట్లు బలం గలవి, అనేక ప్రపంచ దేశాలను చుట్టివచ్చినవి. అయినప్పటికీ మా పట్టు నుండి తప్పించుకునేందుకు అవి ఏ ఆశ్రయమయినా పొందగలిగాయా ? చరిత్ర చెప్పే ఈ సాక్ష్యంలో, మనసున్న ప్రతి వ్యక్తికీ, చెవి ఒగ్గివినే ప్రతీ మనిషికీ గుణపాఠం గరిపే విషయముంది."*

(50 : 30 - 37)

